దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ 1958
దేశీ ప్రెస్, విజయవాడ



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# విషయ సూచిక:

# శ్రీ కృష్ణుడు

శ్రీకృష్ణుడు : అమ్మా, అమ్మా, నే వచ్చేశా!

యశోద : వచ్చావా, నాయనా ! నాతండ్రే, ఇప్పటిదాకా
ఏం చేస్తున్నావు, నాయనా ?

శ్రీకృ: అమ్మా మరేం, మరీ, మరీ, ఆడుకుంటున్నానమ్మా.

యశో: అయ్యో నాయనా ! ఎక్కడ ఆడుకొంటున్నావురా ?
ఇప్పటేగదా ! ఇల్లంతా వెతికేను, నీకోసం.

శ్రీకృ: అమ్మా, నా కేమన్నా పెట్టవుటే ఆడుకుంటాను.

యశో: ఎక్కడాడుకొంటున్నావురా ఇంతసేపటినుంచీని ?

శ్రీకృ: ఏంవే అమ్మా, నాకేమేనా పెట్టవుటే ?

యశో: ఆడుకోవడం లేదు. అల్లరిచేస్తున్నావు, అవునా ?

శ్రీకృ : లేదే, అమ్మా, ఆడుకొంటున్నానే, తువ్వాయిలూ
అవీ పరుగెడుతుంటే చూస్తున్నానే!

యశో: వెన్నముద్ద పెట్టనా ?

శ్రీకృ : ఊహుఁ.

యశో: వెన్నెందుకు వద్దురా ? నీ కిష్టమేగా ?

శ్రీకృ: నాకేం, నాకేం ... ...

యశో: పోనీ, పాలు తాగుతావా ?

శ్రీకృ : ఊహుఁ.

యశో : ఏమిరా, నాయనా, ఏమీ వద్దంటున్నావు; ఇలా దగ్గిరసా రా; ఏదీ చూడనియ్యి నీకడుపు.

శ్రీకృ : వద్దే అమ్మా, వద్దే... పోనీలే, నా కేమీ పెట్టక పోతే - నేను వెళ్ళిపోయి ఆడుకుంటాను.

యశో : నా తండ్రివిగా; దగ్గిరసా రావూ; రా అమ్మా,రా ! ఏదీ కళ్ళు మూసుకుంటాను, ఎవరొస్తారో, ఎవరొస్తారో !

శ్రీకృ : ఊఁ, ఊఁ, ఊఁ, - నేను రానూ - నేను వెళ్ళిపోయి ఆడుకొంటానూ - ఊఁ, ఊఁ.

యశో: నా తండ్రివి గావూ, ఎవరొస్తారో, ఎవరొస్తారో; కంటె వస్తుందో, కాసులపేరు వస్తుందో, నా చిన్ని బొజ్జకృష్ణమ్మ వస్తాడో; నా బంగారు గజ్జెల కృష్ణమూర్తి వస్తాడో; ఎవరొస్తారో ?

శ్రీకృ: ఊఁ, అమ్మా, నేరాను, నేరాను- నే వెళ్ళిపోతాను, నేరాను ...

యశో: రావుకాదూ, నావరహాల మూటవుకాదూ, నాకన్న తండ్రివి కాదూ, నాముత్యాల పేరువుకాదూ, నా నాయనవుకాదూ, రాఅమ్మా, రా. యెవరొస్తారో, యెవరొస్తారో !

శ్రీకృ: అమ్మా, మరేం, నాన్న మొన్న తెచ్చాడు- ఆ బొమ్మ యియ్యవూ ? గదిలోకూచుని ఆడుకుంటాను-

యశో: రావు కాదూ; వస్తున్నా వుండు, పారిపోకురా, చూశావా, చూశావా, యెలా పరుగెత్తుతున్నాడో-

నా నాయనకాదూ- దా. ఇల్లిట్లాదా; నీకు బొమ్మ యియ్యనా ?

శ్రీకృ: ఇయ్యి మరీ.

యశో: నాదగ్గిరకిరా; ఒక్కముద్దు ఇయ్యి; తరువాతబొమ్మిస్తా. యేం ?

శ్రీకృ: నన్ను పట్టుకుని కొడతావ్రూ !

యశో: కొట్టనులే, రా; రా, అమ్మా రా పారిపోకమ్మా ! పారిపోకు- ఆఁ, దొంగా దొరికావు లే-

శ్రీకృ: అమ్మా నాకు మరి బొమ్మియ్యవ్రూ ?-

యశో: ఇస్తానమ్మా యిస్తాను- యేమిరా నాయనా, కడుపు యింత గట్టిగా ఉంది; పొంగిన ట్లుందేమిటి ?

శ్రీకృ: యేమో ! మరి ముద్దు పెట్టుకున్నావ్ర కాదూ- బొమ్మియ్యి-

యశో: ఇదేమిట్రా, వళ్ళంతా ఈజిడ్డు. ఏదీ చూడనియ్యి. అయ్యో, అయ్యో, నాతండ్రీ ఈ పెదివిల మీద ఈనెత్తురు చారలూ ?

శ్రీకృ: యేం లేదు.

యశో: అయ్యో నాతండ్రీ- యెక్కడేనా వెళ్ళి యేమైనా తిన్నావా ఏమిట్రా ?

శ్రీకృ: ఊఁహూ.

యశో: యెవరితోనైనా గిల్లికజ్జాలు తెచ్చుకున్నావా ఏమిటి?

శ్రీకృ: ఊఁహూ.

యశో: నాతండ్రికి దిష్టి తగిలిందమ్మా; దిష్టితీస్తానుండు.

శ్రీకృ: బొమ్మెయ్యవుటే అమ్మా!

యశో: వుండు దిష్టితీస్తాను- తప్పమ్మా తప్పు. దిష్టిదీపం వూదేసి ఆర్పెయ్య కూడదు- ఊదకురా-

శ్రీకృ: మరియ్యవుటే బొమ్మా?

యశో: ఇస్తాను గాని,- చూడు నిజంగా చెప్పు- ఈ కడుపు ఇంత వుబ్బరంగా వుందిగదా- యెక్కడేమి తిన్నావో చెప్పు.

శ్రీకృ: ఊఁ.

యశో: చెప్పవు గాబూ- చెప్పకపోతే యేంచేస్తానో యెరుగుదువా?

శ్రీకృ: మరి పొద్దున్నే, పాలు తాగానుగాదూ!

యశో: ఛా, వుట్టిది-

శ్రీకృ: అవునే.

యశో: చెప్పవూ? చెప్పవూ-

శ్రీకృ: వుండు, వుండు. చెబుతావుండు- కొట్టకు మరి-మరేం, ఇందాకను, మన పెద్దావుందికదూ-

యశో: గబగబా చెప్పూ.

శ్రీకృ: తువ్వాయి దాని దగ్గర పాలుతాగి ఆడుకొంటోందే అప్పుడేం, నేనేం, మరేం-

యశో: యేమి చేశావు, చెప్పూ-

శ్రీకృ: నేనేం, అప్పుడూ, పెద్దావుదగ్గరికి వెళ్ళేనే- వెళ్ళి- తువ్వాయి పాలు తాగుతుందికాదూ- అలాగ-

యశో: అలా యేమిటి?
శ్రీకృ: దాని కాళ్ళసందుకెళ్ళి పాలుతాగేసే-
యశో: అయ్యో, అయ్యో, నాయనా, అది తన్న లేదు గదా?-
శ్రీకృ: లేదే-ఎంచక్కగా వెచ్చగా తియ్యగా ఉన్నాయే-
యశో: ఈ నెత్తురు చారలందుకా - అది తన్నిందా ఏమిటి-
శ్రీకృ: లేదే పాలుతాగుతూంటే తువ్వాయిని నాకుతుంది కాదూ-అలాగే నన్నూ నాకిందే పెద్దావు.
యశో: అయ్యో నీ ఆగడం బంగారంగానూ - ఇంకెప్పుడూ ఆవుకాళ్ళసందుకి వెళ్ళకేం-
శ్రీకృ: వెళ్ళనే అమ్మా.
యశో: మరిందబొమ్మ - ఇంద లక్కపిడతలు - అరుగుమీద కూచుని ఆడుకొంటావుకాదూ?
శ్రీకృ: నే నరుగుమీదకు వెళ్ళను - ఇంట్లోనే నీ దగ్గిర కూచుంటాను-
యశో: అరుగుమీద కూర్చుంటే ఏం, నాయనా?-
శ్రీకృ: నాకు భయమేస్తుందమ్మా, నే వెళ్ళను.
యశో: నా అల్లరితండ్రికి భయంకూడాను? అయితే ఈ పీట మీదకూచో, నేను పాలు పితుక్కువస్తా-

గోపికలు : ఏమమ్మా, యశోదమ్మా, తలుపు తియ్యవమ్మా ఒకమాటు.

యశో: ఎవరమ్మా అక్కడ ?

గోపి : మేమమ్మా, గోపికలము. ఒక్కమాటు తలుపుతియ్యవమ్మా.

యశో: నా కృష్ణు డేడీ ? ఈపీటమీద కూర్చొకుండా ఎక్కడకు వెళ్ళావురా, నాయనా ?

గోపి : తియ్యవమ్మా తలుపు- ఓయశోదమ్మా!

యశో: ఉండవమ్మా వచ్చేను - నాయనా, కృష్ణా! ఎక్కడున్నావురా ?

శ్రీకృ: ఊఁ.

యశో· ఈ మూల నక్కేవేమిరా, నాయనా ?

శ్రీకృ: ఏం లేదు-

గోపి : అదేమమ్మా, పలికిన్నీ తలుపు తియ్యవూ ? మాకు మాత్రం పనులు లేవుటమ్మా, యశోదమ్మా! తలుపు తియ్యరాదుటమ్మా ఒకమారు ?

యశో: వస్తున్నానమ్మా - అల్లాతొందరపడతారేం?- రా, నాతండ్రీ, రా, నిన్నెత్తుకుని వెళ్ళి తలుపు తీస్తాను.

శ్రీకృ: నేను రానే, నాకుభయం !

యశో: గోపికలనుచూస్తే భయమేమిటి? నీవు రోజూ వాళ్ళతో ఆడుకొంటూ ఉంటావుగాదూ !-

శ్రీకృ: నేనురానే అమ్మా - తలుపు తియ్యవే.

గోపి - యశోదమ్మా! ఓ యశోదమ్మా!

యశో: వస్తున్నానమ్మా! తొందరపడకండి-రాఅమ్మా రా, ఎత్తుకొంటాను-అప్పు డాంగా ఎత్తుకోనా, ఎత్తుకోనా?

శ్రీకృ: వద్దే.

యశో: అలాగకాదమ్మా - ఆఁ-ఎత్తుకున్నానామరి - ఈ మాటు తలుపుతీస్తాం, ఏం?

గోపి : ఇక్కడే నిలబడిపోతిమమ్మా, యశోదమ్మా! తలుపు తియ్యవమ్మా-

యశో: ఇదుగోనమ్మా తలుపుతీశాను - ఎందుకమ్మా ఇంత మంది గోపికలు, వేళకాని వేళ, మా ఇంటికి వచ్చారు?

గోపి : అవునమ్మా యశోదమ్మా - మీ పిల్లవాడి ఆగడం మీకు ఇష్టమయితే కావచ్చునుగాని - ఊరివారందరికీ ఇష్టమాతుందమ్మా?

యశో: అదేమే గోపమ్మా, అంతకోపమెందుకే ?- మా పిల్ల వాడేమి చేశాడో చెప్పవే?

గోపిక: ఏమిచేశాడో నేను చెప్పడమెందుకమ్మా? మీపిల్ల వాడి ఆగడం మీకు తెలియదటమ్మా?

ఇంకో గోపిక : మీపిల్లవాణ్ణి అదుపాజ్ఞలో పెట్టుకోక - ఏమి చేశాడంటా వేమిటమ్మా, యశోదమ్మా?

మూడో గోపిక : మీ కృష్ణుడు ఏమీ ఎరగని నంగ నాచమ్మా!- నోట్లోవేలుపెడితే కరవలేదు పాపం!-

యశో: మా పిల్లవాడు పొద్దుటునుంచీ మా ఇంట్లోనే ఉన్నాడు గాదటమ్మా-

గోపి : అవునమ్మా మీ ఇంట్లోనే ఉన్నాడు-

ఇంకో: మీ ఇంట్లోనేఉండి మా ఇళ్ళన్నీ చక్క బెడుతున్నాడు. కాదటమ్మా, యశోదమ్మా?

మూడో: చంకలోనక్కి కూచుని ఎలాచూస్తున్నాడో ఏమీం ఎరగనట్లు - నాలిముచ్చులా అలా చూస్తున్నావుగా ఏమీం ఎరగనట్లు కృష్ణా!

యశో: అయితే మీంరందరూ కలసి యేమి తప్పు చేశాడం టారు మా కృష్ణమ్మ!

గోపి : అవునే, య. .ద. .మ్మ, మమ్మ్మాదు కడుగుతావమ్మా, మీపిల్లవాణ్ణే అడగవమ్మా-

ఇంకో గోపిక: యేమిరా .ృష్ణా, చెప్పరా మీ అమ్మతోటి?

యశో: యేమి చేశావు నాయనా, యేమి చేశావు ?- నాకు చెప్పవూ ?

శ్రీకృ: యేమీం చెయ్యలేదే-

గోపి : యేమి చెయ్యలేదుట్రా వెంకీ ?

ఇంకో: ఏమీం చెయ్యలేదుగా, నంగనాచీ !

మూడో: అవును యేమీం చెయ్యలేదు- యేమైనా చెయ్య గలవా అల్లరి- పాపం- అవునా కొంటే !

యశో: యెందుకమ్మా, మా అబ్బాయిని మాటలంటారు ?- యేమిచేశాడో మీరు చెప్పరాదుటమ్మా ?-

గోపి : మేమెందుకు చెప్పాలమ్మా యశోదమ్మా ?

యశో: చెప్పకపోతే యెట్లా తెలిసేనమ్మా, గోపమ్మా ?

గోపి : తెలియదంటా వేమిటమ్మా ? అంతా విడ్డూరం ! మీ అబ్బాయివళ్ళు పూశావుటమ్మా ?

ఇంకో: ఆజిడ్డంతా వంటికి యెందుకు వచ్చిందో అడగరాదుటమ్మా, ఆనొంగ కృష్ణుణ్ణి ?–

యశో: ఏమిరా నాయనా, ఒంటికి జిడ్డుయెందుకు వచ్చిందంటాపురా ? చెప్పమ్మా ?

గోపి : ఆ పెదనిమీద చారలేమిటో అడగవేమమ్మా, యశోదమ్మా ?

శ్రీకృ: అమ్మా, వాళ్ళని వెళ్ళిపొమ్మనవే భయంవేస్తోంది –

యశో: అదేమిటమ్మా! అందరూకలసి మా కృష్ణమ్మను బెదరగొడుతున్నారు – వెళ్ళండమ్మా, మీ ఇళ్ళకు మీరు వెళ్ళండి – ఎవళ్ళనిచూచి ఎవరనుకొన్నారో–

గోపి : ఎంతచిత్రంగా మాట్లాడుతావమ్మా– మీ కృష్ణమూర్తినే మేమెరగము కాబోలు !

ఇంకో: మా కెప్పుడూ కనిపించకుండానే ఉంటున్నాడు కాబోలు. రోజుకు రోజు !–

యశో: అయ్యో, ఎంత ఖర్మంవచ్చిందమ్మా! మా నాయన ఏమీ చెయ్యలేదంటూంటే ఏమో అల్లరి చేశాడంటున్నారు కాబోలు – ఆ అల్లరి ఏమిటో చెప్పరాదుటమ్మా !

గోపి : పిల్లలని అదమాయించుకోకుండా మేమేమో అన్నామంటా వెందుకమ్మా?– మీ అబ్బాయినే అడగవమ్మా ! మాటలురావా ఏమిటి పాపం, మీంవాడికి ?

యశో: చెప్పు, నాయనా, ఏమి చేశావో చెప్పు.

శ్రీకృ: నేనేమీం చెయ్యలేదే అమ్మా.

యశో: మా కృష్ణమ్మ ఏమీం చెయ్యలేదంటున్నాడమ్మా.

గోపి : అంటాడమ్మా, అంటాడు - అనడు మరీ!- మీంవాడు బుద్ధిమంతుడు- చూడమ్మా, నువ్వేచూడు-దీనిపెదవి ఎలాగు కొరికివేశాడో చూడు- చూపవేమే గోపీ, పెదవిచూపు-అల్లా సిగ్గుపడతావేం ?

శ్రీకృ: ఉత్తిదే అమ్మా !

ఇంకో: చూడవమ్మా, మీంబుద్ధిమంతుడు మాచెల్లెలి పెదవి కూడా రక్తాలొచ్చేటందుకు ఎలా కొరికేశాడో !

శ్రీకృ: ఊం- నే కొరికేనా ?

ఇంకో: చూడమ్మా యశోదా, చూడు. ఈ పిల్లబుగ్గ- పళ్ళు ఎలాగ దిగాయో- మా పిల్లలుమాత్రం పిల్లలుకారుటమ్మా ?

శ్రీకృ: నాకు వెన్నముద్ద ఇస్తానని ఆశపెట్టి-

యశో: అయితే నిజంగా కొరికేవ్రుటా - చూడు నిన్నేం చేస్తానో! ఏమి చేశావో నిజంగా చెప్పు.

శ్రీకృ: కొట్టకే అమ్మా ! మరి చెబుతాను-

యశో: చెప్పు మరి.

శ్రీకృ: మరేం, ఈపిల్ల నాకు వెన్నముద్ద పెడతానందే-

యశో: ఎప్పుడూ ?

గోపి : ఎప్పుడేమిటి? ఇందాకనే!

యశో: అవునా ?

శ్రీకృ: 'నాకు వెన్నముద్ద పెడతానన్నావు- పెట్ట'మంటే చేత్తో తట్టుకు ఊరించిందే 'పోనీలే, పోనీలే, పెట్టవూ' అంటే నోట్లో పడేసుకుని ఆకాశం చూపించిందే.

పిల్ల : అన్నీ అబద్ధాలే.

యశో: నిజం చెప్పవు(ట్రా.

శ్రీకృ: అప్పుడు నే నన్నానుగదా - మా అమ్మతో చెప్తా నుండు - అన్నాను. అంటే నన్నెత్తుకుని వెన్నముద్ద బుగ్గను పెట్టుకుని - బుగ్గకొరికి తీసుకుకోమందే-అంటే నేను బుగ్గ-

యశో: ఏమమ్మా, మీ రే మాపిల్లవాడికి అల్లరినేర్పి మా పిల్లవాడు అల్లరిచేస్తున్నాడని ఎదురు చెప్పుతారమ్మా!

గోపి : మీంపిల్లవాడు మహానిజమరిలాగ చెప్పుతావే మమ్మా!

యశో: అయితే నిజ మేమిటమ్మా ?

గోపి : పోనీ చిన్నవాడుగదా అని ఎత్తుకొంటే 'నీబుగ్గ వెన్న ముద్దలాగ ఉం'దని కొరికేశే నీకొడుకు యశోదమ్మా.

ఇంకో: పెదవి ఎందుకు కొరికాడో అడగవమ్మా ?

యశో: నిజం చెప్పరా; నీమూలాన్ని మాకు ఉండరాములు లేకుండా ఉన్నాయి.

శ్రీకృ: ఆ అమ్మాయి నన్నెత్తుకోలేదా ఏమిటి మొదట - నన్నెందు కెత్తుకోవాలి ?

గోపి : చిన్నపిల్లాడవని ముద్దుకొద్దీ ఎత్తుకొంది - ఎత్తుకొందని పెదవి కొరికేస్తావా ?

శ్రీకృ: నేకోరికేనాఏమిటి? నన్నెత్తుకుని పాటపాడింది-ఆపాట తియ్యగా ఉందన్నాను-

యశో: అంటే!

శ్రీకృ: 'ఆతీపి ఎక్కడి దనుకున్నావు'-అందే, ఆఅమ్మాయి! అంటే 'పెదవిల్లోంచి వస్తోంద'న్నానే- అంటే 'పాట తీపి పెదవుల మూలాన్నే-కావలిస్తే చూడు' అందే - అంటే కోరికేనే.

యశో: మీకు న్యాయమేనమ్మా? ఇటువంటి బుద్ధులు పిల్ల వాడికి నేర్పుతారుటమ్మా.

గోపి: మీపిల్లవాడి మాటలే నిజమనుకుంటున్నావేమమ్మా యశోదా?- మీకృష్ణుడు వట్టి మాయలాడమ్మా - ఎత్తుకుని ముద్దుపెట్టుకోమని అడిగి పెదవులమీద ముద్దు పెట్టుకోంటూంటే గోపిక పెదివి కోరికివేశా డమ్మా!

యశో: అవునుట్రా కృష్ణా ?

శ్రీకృ: కాదే అమ్మా !

యశో: ఏమీరా నాయనా ఇంతఅల్లరి చేస్తారురా! నిన్నేమి చేయమన్నావు చెప్పు ?

గోపి : ఇంకా వినవమ్మా మా మాటలు.

యశో: ఇంకా ఏముందమ్మా.

ఒకగో: మా గూనలో వెన్నంతా తినేశాడే ఓయమ్మా!

ఇంకో: మా పెరుగంతా దిమ్మరించేశాడే యశోదమ్మా!

ఇంకో; మూపాలన్నీ పంచిపెట్టేశాడే ఓసెమ్మా!

గోపి : ఏమిబుద్ధులు చెబుతావో చెప్పమ్మా మీపిల్లవాడికి-మమ్మల్ని ఇక్కడ ఉండమంటావో, ఇంకో వూరు చూచుకోమంటావో.

యశో: ఇక్కడ కూర్చో కృష్ణా, ఇంట్లోకివెళ్ళి తాడు తెచ్చి నిన్ను స్తంభానికి కట్టివేస్తాను.

శ్రీకృ: వద్దే, అమ్మా.

గోపి : నీవు వెళ్ళి తాడు తేవమ్మా! పారిపోకుండా మేము చూస్తూ ఉంటాము.

యశో: ఇదుగో వెడుతున్నానమ్మా- పారిపోనివ్వకండమ్మా!

3

ఒకగో: నన్నుకూడా ఒకమారు ఎత్తుకోనియ్యవమ్మా మా చిన్ని కృష్ణుణ్ణి!

ఇంకో: ఉండవమ్మా, నువ్వొ ఎత్తుకొందువుగాని-అయితే కృష్ణా-మీ అమ్మదగ్గిర ఎందుకు చెప్పావు అన్నేసి అబద్ధాలు?

శ్రీకృ: మా అమ్మతో వారెందుకు చెప్పాలేమిటి?

గోపి : నేనుకూడా ఎత్తుకుంటాను ఒకమాటురావూ? నా కృష్ణమ్మవు కావూ?

శ్రీకృ : నేరాను, మొన్ననెందుకు నన్ను కొట్టావు?

గోపి : చూశావా, చూశావా, నేను కొట్టానా?

శ్రీకృ : ఊం- కొట్టలేదు కామోసు?

గోపి : నారవిక చింపేస్తే నేకొట్టనూ—నాదగ్గిరకిరావుకాదూ? రావుకాదూ ?ఎందుకు రావో చూస్తాను - ఏం, ఏం— ఈమాటు వచ్చావా !

శ్రీకృ: మా అమ్మతో చెబుతానుండు !

గోపి : చెబుతావా—చెబుతావా - నీబుగ్గలుచిదిమి బూర్లొండే సెయ్యనా? వండెయ్యనా ? చెప్పుకృష్ణా, చెప్పు ?

శ్రీకృ: నా కూపిరి సలపడంలేదు.

గోపిక: నీబొజ్జ కరిగించెయ్యనా ? నీచిన్నిబొజ్జ—ఏదీ నీచిన్ని బొజ్జ ఏదీ ?—

శ్రీకృ: నన్నొదిలెయ్యి.

ఇంకో: అలాగ నలిపేస్తావేమమ్మా చిన్ని కృష్ణమ్మని ?— ఇలా ఇయ్యవమ్మా—మేము మాత్రం ఎత్తుకో వద్దు టమ్మా?

గోపి - ఇందవమ్మా, అల్లరి కృష్ణమ్మని ముద్దుగా ఎత్తుకుంటే తలంతా ఎలా రేపేశాడో- ఇంకెప్పుడూ రేపెయ్యవు గదా ?—నల్లగా జీడిగింజలా ఒళ్ళూ నువ్వూను ?

ఇంకో: ఏడీ ? నా కృష్ణమ్మ ? నా ముద్దులమూట ఏడీ?— కృష్ణా ఏదీ నీబుగ్గ - ముద్దుపెట్టుకోనియ్యి - కూకటిని కూడా ముద్దుపెట్టుకోనియ్యి ?— ఏదీ నీవరాల బొజ్జ?— ఇదేనా?— ముద్దుపెట్టుకోనా ?

శ్రీకృ: నాకు కితకిత లవుతున్నాయి—

గోపి : ఏదీ నీగజ్జెల మొలతాడు ?— ఒక్కముద్దు పెట్టుకో నియ్యి. నీచిన్న పాదాలేవీ?— చిన్నపాదాలు - ఎర్రని మెత్తని పాదాలు—ఒక్కముద్దు !

ఇంకో: అస్తమానం నువ్వే ఎత్తుకోవాలటమ్మా?- పాపం! ఇక్కడ కూర్చోబెట్టనేనా కూర్చోబెట్టమ్మా - పిల్లవాడు నలిగిపోతున్నాడు.

శ్రీకృ: నేను కూచోను, కూచుంటే అమ్మ వచ్చి కొడుతుంది.

గోపి: పోనీ మాయింటికి తీసుకుపోమా?

శ్రీకృ: నే రాను.

గోపి: ఉండు, కృష్ణా - ఈ చీరకొంగుతో నీవంటి జిడ్డంతా తుడిచేనియ్యి-నెమలిపింఛము సరిగా పెడతానుండు - కదలకు. పువ్వులు పెట్టనియ్యి-అయ్యో, మాకృష్ణమ్మ బొట్టు చెరిగిపోయిందమ్మా ఏమిచేశాడో గాని?

గోపి: నీవు అలా నిలబడవమ్మా, నీబొట్టు కొంచెంతీసి కృష్ణమ్మకు పెడతాను-

శ్రీకృ: అమ్మొస్తూంది.

గోపి: అక్కడ కూచోబెట్టవే, అక్కడే కూచోబెట్టు - మన మిక్కడే ఇదివరకులాగు నిలబడదాము.

యశో: ఏడమ్మా కృష్ణుడు పారిపో లేదుగదా- ఎక్కడా పాడు తాడు కనిపించడమే లేదు. ఇప్పుడే వస్తాను-చూస్తూ ఉండండమ్మా మాపిల్లవాడిని.

గోపి: వెళ్ళవమ్మా చూస్తూ ఉంటాము - మీఅమ్మ వెళ్ళిందిలే-రావూ నేనెత్తుకుంటాను, కృష్ణా రావూ?

శ్రీకృ: నేను రాను.

ఇంకో: పోనీ నాదగ్గరికి రా?

శ్రీకృ: ఊహూఁ, రాను.

ఇంకో: నాదగ్గిరకో ?

శ్రీకృ: నే రాను.

గోపి : పోనీ అమ్మా, మరి – నువ్వు రాకపోతే మీఅమ్మతో చెప్పి కొట్టిస్తానుండు.

శ్రీకృ :ఊఁ, మా అమ్మతో నేనూ చెబుతాను– 'అమ్మా, అమ్మా, నేను పారిపోలేదు. నేను అల్లరిచెయ్యలేదు మరేం– నన్నెత్తుకుంటానంటే వెళ్ళనన్నానే అమ్మా– అంటేనే అమ్మా–'అంటాను.

గోపి : రావుకాదూ, రాకపోతే మొట్టికాయలు తింటావు సుమా !

ఇంకో: ఏ వేలితో మొట్టానో చెప్పు.

ఇంకో: నే నేవేలితో మొట్టానో చెప్పు.

గోపి : అయ్యో, పాపం మాకృష్ణమ్మని అందరూ అలాగా మొట్టికాయలు మొట్టుతారేమిటమ్మా పాపం !– రా కృష్ణా, రా, నే నెత్తుకుంటాలే.

గోపి : నాచీర చింపేశాడే, అయ్యో!

ఇంకో: నాహారాలు తెంపుతావురా ఇలాగ ?

శ్రీకృ: నన్నెందుకు కొట్టాలి ?

గోపి : కొట్టములే– నేను ఎత్తుకున్నానామరి– ఏది, ఎక్కడ నొప్పెట్టింది చూపించు. అక్కడ ఒక్కముద్దుపెట్టు కుంటే పోతుంది.

ఇంకో గో: పాపం నొప్పెట్టిందా. ఉండు నే ముద్దుపెట్టుకుని నొప్పి తీసేస్తాను- ఏం ఈమాటు పోయిందా ?

ఇంకో గో: అందరినీ ఒక్కమా రెత్తుకోనియ్యండమ్మా-అస్తమానం ఒకరే ఎత్తుకుంటే ఎలాగవమ్మా చిన్నికృష్ణమ్మని ?

గోపి : ఇదుగోనమ్మా, నువ్వెత్తుకోవమ్మా మా చిరిబొజ్జ కృష్ణమ్మని!

ఇంకో గో: నువ్వా ఎత్తుకోవే నల్లకృష్ణమ్మని !

ఇంకో గో: ఇదుగోనమ్మా కృష్ణమ్మా, పెద్దతామర రేకుల్లా కళ్ళూ పీడూను. నలిపెయ్యకుండా ఎత్తుకోండమ్మా.

ఇంకో గో: ఇలా తేవే, నేనూ ఎత్తుకుంటాను.

ఇంకో గో: పాపం, ఊపిరి సలపదే-అంతగా మొహంమీద మొహం పెట్టి ముద్దులాడతా వేమిటే ?

గోపి : అందరూ ఇలా గుమిగూడా రేమిటమ్మా ?

యశో: ఏడమ్మా మాకృష్ణమ్మ ?

గోపి : ఇదుగోనమ్మా, బిక్కమొహం వేసుకు కూర్చుంటే పోనీ పాపం అని ఎత్తుకొన్నాము.

యశో: అదేవమ్మా, అంతా చోద్యంగా చెప్తాతావు-ఇప్పుడే కాదటమ్మా, మా కృష్ణుడు అల్లరిచేశాడని ఆడి పోశారు ?

గోపి : అల్లరి చెయ్యలేదంటున్నామమ్మా ఇప్పుడు మాత్రం

యశో: నేను చూడ్డం లేదుటమ్మ - మా కృష్ణమ్మ నెత్తుకుని అందరూ ముద్దాడడం లేదుటమ్మా ?

గోపి : చిన్నపిల్లాడుగదా అని ముద్దాడితే తప్పటమ్మా ?

యశో: బుద్ధులు చెప్పమనీ, దండించమనీ ఎంతో కోపముతో చెప్పి- ఇంతట్లోకే ఎలా ముద్దాడు తున్నారమ్మా ?

గోపి : అల్లరిచేశాడు కనుక చేశాడన్నాముగాని-ఇంతట్లోకే పాపం, కృష్ణమ్మని తాడుతో స్తంభానికి కట్టివెయ్యాలమ్మా ?

యశో: మీరేకాదటమ్మా మా కృష్ణమ్మ మీద నేరాలు మోపారు ?

గోపి : అదేమిటమ్మా, అలాగంటావు - మేముమాత్రం కనీ పెంచే వాళ్ళము కాదుటమ్మా-ఆమాత్రానికి పిల్లలని తాళ్ళతో స్తంభాలకి కట్టివేస్తారుటమ్మా ?

యశో: నేనప్పుడే అనుకొన్నాను - మా కృష్ణుడు అల్లరిచేసే వాడు కాడని-ఎందుకమ్మా ఈలాటి నీలాపనిందలు మా కృష్ణమ్మమీద వెయ్యడం?- ఇది న్యాయమే నటమ్మా ?

గోపి : ఉండవమ్మా ఒక్కమారు కృష్ణుణ్ణి ముద్దుపెట్టుకొని వెళ్ళి పోతాము.

యశో: అలాగ అందరూ మీదపడి నలిపేస్తారేమమ్మా చిన్న పిల్లాడిని ? మా అబ్బాయిని ఇలా ఇయ్యండమ్మా - బెదరిపోతాడు-

గోపి : ఇదుగోనమ్మా తీసుకోవమ్మా ఇంతటిమహా మీ అబ్బాయిని. మేము వెళ్ళిపోతున్నాము.

యశో: రారా, నాయనా, రా, అమ్మా, రా, నీమీాద ఎలాంటి నేరాలు మోపేరో - తీరామోసి వాళ్ళ మాటలునమ్మి నిన్ను స్తంభానికి కట్టేనుకాను - ఇంకా నయం- ఎంతటి వాళ్ళైనా ఉంటారు.

శ్రీకృ: అమ్మా నాకు బువ్వెట్టవుటే!

యశో: పెడతానమ్మా. పెడతా - భయమన్నావు - భయం పోయిందా నాయనా.

శ్రీకృ: పోయిందే.

యశో: అయినా ఇంకోమారు దిష్టితీస్తానుండు - ఎవరికళ్ళు ఎలాంటివో.

శ్రీకృ: అ సమానం నాచుట్టూరా మిరపకాయలు తిప్పుతానంటావెందుకే - నాకక్కర లేదమ్మా - నాకొద్దు.

—*—

# అహల్య

## ౧

మందారము: చూచావా, పారిజాతం?

పారిజాతము: ఏమిటి ?

మందా: నిన్నను ఇక్కడలేదు; ఈ రోజు పగలు ఇక్కడలేదు; రాత్రి నిద్రలేచి చూతునుగదా—

పారిజా: అవునవును. ఆడుకొనే రాక్షసుల పిల్లలు పడవేశారో, దేవతలు ఆసనశిలగా ఏర్పాటు చేసుకొన్నారో, గంధర్వ కాంతలు లాక్షారేఖలు పాదముల పై తీర్చుకోడానికి పాదపీఠముగా ఉంచుకొన్నారో దీనిని ?

మందా: అట్టి శిలకాదు - పారిజాతం, ఇది.

పారిజా: మనము నిద్రపోతున్నప్పుడు శిలావర్షం కురవలేదు గదా ?

మందా: ఈ ప్రాంతమున ఈ శిల ఒక్కటే కానవస్తున్నది చూడు.

పారిజా: అన్యగ్రహ సాహచర్యమును వదలి భూమి నాశ్రయించడానికి ఉల్కారూపమున దిగిన శిలకాదుగదా ఇది.

మందా: అది అట్టి శిల కానేరదు, పారిజాతం !

పారిజా: భూకంపంవల్ల హిమగిరి ఊటాడి ఈశిల నిక్కడికి విసరివేయ లేదుగదా ?

మందా: లేదు. లేదు గండకీనదిలో పుట్టే సాలగ్రామ శోభ వచ్చింది దీనికి.

పారిజా: ఏమైనా ఈ శిల మన సేవకు పాత్రమే ననిపిస్తోంది.

మందా: అసలు ఈశిల శిల కానట్లున్నది. ఎవరో తెలుసుకోవాలి.

పారిజా: ఆ సంగతి తెలుసుకోవడ మెంత సేపు. వాయువు మన ఆకులతో గుసగుసలాడినప్పుడు తెలుసుకోవచ్చును.

మందా: దూర దేశ సంచారులైన పక్షుల పాటలలో ఆవార్త ఇమిడి ఉండవచ్చును.

పారిజా: మన పుష్పాల నాశ్రయించే తుమ్మెదల స్తోత్ర పాఠముల కది లక్ష్యమై ఉండవచ్చు.

మందా: ఆ సంగతి కనుక్కొందాము.

పారిజా: అలాగే.

౨

గంధర్వుడు : దేవేంద్రు డానతిచ్చాడు, ఈ లోకములో శిలలన్నీ పరీక్షించమని.

గంధర్వి: ఎందుకో ?

గంధ : తాను ప్రేమించిన స్త్రీ గౌతమశాపమున శిలయైన దట—

గంధర్వి: పాపము !

గంధ : ఏశిలలో నందనవన వాసనలు ఘుమఘుమ లాడుచుం టవో, ఏ శిలలో భయకంపిత హృదయము తటతట కొట్టుకుంటూ ఉంటుందో,—

గంధర్వి: ఎంతటివెర్రి - దేవేంద్రుడికి ?

గంధ : ఎందువల్ల ?

గంధర్వి: శిలారూపము పొందిన స్త్రీకి స్త్రీత్వలక్షణము లుంటవా, శిలా లక్షణము లుంటవా ?

గంధ : కాముకుని భ్రాంతి మన కీపని కల్పించినదన్నమాట.

గంధర్వి: ఎన్ని శిలలు పరీక్షించావు ఇంతవరకు ?

గంధ : ఎన్ని శిలలని చెప్పను. అన్నీ ఒక్కమాదిరిగానే శిలా లక్షణములతోనే కనిపించినవి. పూర్వము స్త్రీ రూప మున నున్న శిల ఇది అని ఎట్లా తెలుసుకోవడం నీవు చెప్పు!

గంధర్వి: నేనెన్నడైనా శిలారూపము ధరించి ఉన్నట్లయితే చెప్పిఉందును.

గంధ : స్త్రీవి కాబట్టి ఆమాత్ర మూహించలేవూ ?

గంధర్వి: సుఖము దుఃఖముగా మారినదిగదా, పాపము, అహల్యకు—పాపము చేసినందుకు ప్రతీకారము శిలా రూపము గదా !

గంధ : అయితే—

గంధర్వి: ఆ శిలారూపములో పశ్చాత్తాపము చూడవచ్చును.

గంధ : ఎట్లా ?

గంధర్వి: చివరిదాకా విను,

గంధ : సరే.

గంధర్వి: పశ్చాత్తాపమునకు ఫలముండవద్దా మరి : ఏమిటా ఫలం?

గంధ : పాపము క్షాళితము కాగా తిరిగి మానవజన్మ పొందడము.

గంధర్వి: ఎట్లా ?

గంధ : అది శాపములో ఒక భాగమే గదా !

గంధర్వి: ఏమి టది?

గంధ : శ్రీరామపాదస్పర్శవల్ల శిల మళ్లీ స్త్రీగామారగలదని.

గంధర్వి: కాబట్టి భవిష్యత్తులో తనకు కలుగ గల మేలుకు కారణభూతమయ్యే శ్రీరామపాదస్పర్శకు ఏ శిల మృదులమై వేచిఉంటుందో ఆ శిలను వెదుకుదాము పద.

గంధ : అంతేకాకుండా ఇంకోవిశేషంకూడా ఉండవచ్చును.

గంధర్వి: ఏమిటది ?

గంధ : నైసర్గిక పరిణామమందు శిల స్త్రీగా మారడానికి ఎన్ని యుగముల కాలమో పట్టునుగదా !

గంధర్వి: అవును.

గంధ : శాపకారణమువల్ల నిసర్గమునకు వ్యతిరేకమైన కార్యము ఇప్పుడు ఒక్క క్షణములో జరిగినది.

గంధర్వి: జరిగితే ?

గంధ : ఈ విపరీత పరిణామ కార్యములో తదవస్థలు కొన్ని గోచరము కావచ్చునేమో ?

గంధర్వి: దేవేంద్రుడు డన్న నందనవనవాసనలు మొదలైనవి చూడవచ్చుననా ?

గంధ : కాదు–ఆ శిలల్లో కొంతవరకు మానవత్వము, కొంతవరకు పశుత్వము, కొంతవరకు జడత్వము కావచ్చునేమో?

గంధర్వి : చూద్దాము పద.

3

మందా: విన్నావా. పారిజాతం ?

పారిజా: ఏమిటి ?

మందా: గంధర్వులు శిలలు వెదుకుకొంటూ ఈ వైపుకు వస్తున్నారట.

పారిజా: ఎందుకో ?

మందా: అహల్య శిలగా మారినశిల ఏదైనదీ చూచి దేవేంద్రుడికి చెప్పడానికి.

పారిజా: ఎవరు చెప్పారు ?

మందా: నా కొమ్మలమీద విశ్రమించిన చిలకలు చెప్పుకొంటూంటే విన్నాను.

పారిజా: ఒక స్త్రీ హృదయమును భగ్నముచేసి దాని జీవితమునకు చిచ్చుపెట్టిన ఇంద్రునకెందుకీ తాపత్రయము.

మందా: భగ్న ప్రేమకు అశ్రుతర్పణము ఆ శిలమీద విడుస్తాడు కాబోలు ?

పారిజా. : ఆశిలయందు తన ప్రేమ కాస్పదమైన స్త్రీని ఆరో పించుకొని పూజిస్తాడేమో ?

మందా: శిలగా నున్నా ఆమెకు శాంతిలేదు కాబోలు ఈతని వల్ల !

పారిజా: తాను ప్రేమించిన లావణ్యము, సౌందర్యము, తార ళ్యము, నర్మభాషలు, మందహాసములు శుద్ధ జడ రూపములో నున్న ఈ శిలలో ఎట్లా చూస్తాడో ఈ దేవేంద్రుడు ? చిత్రం ! తనకు జరిగిన పరాభవమైనా తలచుకొన్నాడు కాదు కాబోలు !

మందా: పాపము, ఈశిల ఎట్లాఉన్నదో చూడు. దుఃఖమంతా ఘనీభవించిన శిలాకారమున అవతరించినట్లున్నది.

పారిజా: పంకిలమైన దేహము పశ్చాత్తాప రేఖలతో శిలా రూపము ధరించినట్లున్నది—మనపాదము లాశ్రయిం చినది–పాపము !

మందా: చూడు, చూడు, ఎట్లు అది సంకోచ వికోచములు చెందుతున్నదో !

పారిజా: దుఃఖముతో కుమిలిపోతున్న దా అన్నట్లు !

మందా: దుర్భరదుఃఖముతో కాబోలు ప్రత్యణువూ కంపించి పోతున్న ఈశిల మన సేవకు పాత్రమే అనిపిస్తున్నది.

పారిజా: అరుగో గంధర్వుడూ–గంధర్వీ వచ్చేశారు.

గంధ : ఇక్కడో శిల ఉన్నది.

గంధర్వి: చూడు, చూడు, గంధర్వా, ఈ శిల, పాపం.

గంధ: హృదయవేదన కాబోలు ఆ స్పందనకు కారణము! దానిలో మనుష్యత్వము గోచరించడం లేదా ?

గంధర్వి: అది పశ్చాత్తాపము—స్త్రీత్వ మందులో గోచరిస్తోంది. ఆవైపు అణుస్పందన మెట్లా లయమవుతున్నదో !

గంధ: మానవత్వము పోయి, పశుత్వము నశించి, శుద్ధజడత్వస్థితి కొన్నాళ్లు అనుభవించడముకు సంసిద్ధమౌతూన్నట్లుంది.

గంధర్వి: ఈజడత్వములో పరమార్థచింత ఇమిడి ఉండడము గొప్ప విశేషము.

గంధ: ఇది జడత్వము కాదేమో అసలు ! శిలారూపమును బట్టి జడత్వ మనుకోవలసిందే కాని అసలు ఈస్థితి నిత్యసమాధిస్థితి ఏమో ?

గంధర్వి: నీవు చెప్పినమాట నిజము కావచ్చు.

గంధ: చూడు గంధర్వీ,—పరిణామ మొందుచున్న ఈ శిలలో ఆ తారళ్య రేఖలు—అవి నేత్రాణువులు కాబోలు ! ఆమార్దవ చిహ్నాలు—అవి దేహాణువులు కాబోలు; ఆ తళుక్కులు—అవి మందహాస రోచులు వెదజల్లే వక్త్రాణువులు కాబోలు ; ఆసౌరభము, ఆ నైల్యము, ఆసౌందర్యము, ఆసావర్ణ్యము, ఆ ఆకర్షణము— ఆమె దేహామందలి ప్రత్యణువూ ఆశిలారూపములో ప్రతిబింబిస్తూన్న ట్లున్నది.

గంధర్వి: ఆశిలలో లేవవి; నీకళ్ళలో ఉన్నవి—కాముకుడవు కాబట్టి.

గంధ: కాదు గంధర్వీ, నీ లావణ్యాదులే ఆశిలలో ఉండ చూచుకొంటున్నాను.

గంధర్వి: ఇక్కడిక ఉండరాదు, పద- దేవేంద్రుడితో చెప్పుదాము పద.

గంధ : హృదయమును నీవు చేస్తూన్న ఈశిలను చూస్తే జాలి పుట్టుతోంది.

గంధర్వి: పద, వెడదాము పద—రా, గంధర్వా, రా.

## ౪

దేవేంద్రుడు: నాఅహల్యకు శరణిచ్చినవట మందారపారిజాతాలు-అవి ఎక్కడో ఆ శిలను నేను గుర్తించగలనా?

ఇదిగో మందారము, ఇదిగో పారిజాతము—ఇదా ఆశిల—నాఅహల్య! పాప మివి అప్పుడే ఈశిలను తమపువ్వులతో పూజించి నాకృతజ్ఞతకు పాత్రమైనవి.

ఈ శిలా నా అహల్య? ప్రేమాంకూరాలు పుట్టడానికి పాదైన ఆ హృదయమేది? ఈతటతట కొట్టుకుంటూ ఉన్న భాగ్యమా! అమృతనిష్యందమగు అధర మాజేగురు రంగుతో ఈ మూలనున్న నున్నని గుండ్రని భాగము? గాఢాశ్లేషణ శీలములగు బాహువులా ఈ మృదుల శిలా భాగమందలి ఈ పచ్చని జీరలు? ఆ మదిరాక్షి నేత్రముల తళ్కులా ఈ స్ఫటికాకృతి నున్న ఈ మూల శిలాభాగము?

—ఈవైపున నున్న సువర్ణచ్ఛాయ గాబోలు ఆమె దేహ చ్ఛాయ—ఈశిలేనా నాఅహల్య! అయ్యో, నా అహల్యకు యెంతటి అవస్థ పట్టింది!

ఔరా! ఈశిల నన్నుచూచి ఎట్లా కదిలిపోతోందో! దారుణ ప్రయత్నము చేసి, తననోటితో నన్ను పిలిచి, తన బాహువులతో నన్ను కట్టి వేసికొని నన్ను తనలో ఐక్యము చేసుకోవాలని ప్రయత్నము కాబోలు— వ్యర్థ ప్రయత్నము! ప్రేమ సామ్రాజ్య పట్టభద్రతకు సోపానాలు కట్టిన నా అహల్య యిప్పుడు చేతనా రహితమై నాకు స్వాగతమైనా చెప్పలేకుండా ఉందా!

అహల్యా, అహల్యా! ఒక్కమారు నా పిలుపుకు మారు పలుకవూ? —ఈశిలకు స్పందనము అధిక మౌతూ ఉన్నది. నాతో మాట్లాడుటకు కాబోలు ప్రయత్నిస్తోంది. నీ కనునయము కల్పించడానికి వచ్చాను అహల్యా, వొక్క మాట మాటాడవా— ఆ శిలలోనుంచి శబ్దము వస్తూవున్న ట్లుంది. జాగ్రతగా వింటాను—

శిల : (శబ్దము)

దేవేం: యేదో శబ్దమే అది— అహల్యా, నామాట విని పిస్తోందా? నాకు ప్రత్యుత్తరము చెప్పుతావా? మన మన దుఃఖములు ఒకరితో ఒకరము వెళ్ళబోసుకొని దుఃఖోపశమనము పొందుదామా? మాటాడు, అహల్యా, జాగ్రతగా వింటూను, మాటాడు,

శిల : (శబ్దము)

దేవేం: ఆ శబ్దము యేమై వుంటుంది ? అది ప్రణవము వలె ఉన్నది—తప్పు విన్నానేమో ! దేవేంద్రుడా అని పిలిచిందేమో; మళ్ళీవింటాను.

శిల: (శబ్దము)

దేవేం: అది నన్ను పిలిచిన పిలుపు కానట్లుంది. అది ఇంద్ర శబ్దము కానట్టుంది. అది ప్రణవమో—లేక—రామ శబ్దోచ్చారణమో ?— నన్ను నా అహల్య గుర్తించ లేదేమో ! అహల్యా, నేను దేవేంద్రుడను. నీకోసం చూడు, ఈ నందనవన కుసుమములు తెచ్చాను ! చూడు, వీటితో నిన్నలంకరిస్తున్నాను— నేను దేవేంద్రుడనే అహల్యా! శ్రీకారాకారముగా స్పం దిస్తున్న ఆ నీ శ్రోత్రాణువులతో నామాట లాల కిస్తున్నావా, అహల్యా, ఆలకిస్తున్నావా ?

శిల : (శబ్దము)

దేవేం: మళ్ళీ ఆశబ్దమే వినిపిస్తోంది. ఆమె ఆలకించడంలేదు. అది ప్రణవమూ రామశబ్దమూ మిళితమై కలిగిన ధ్వని,— ఈ దీనునిపై అహల్యకు కోపము వచ్చింది కాబోలు. ఆమె ప్రేమకు పాత్రమయ్యే విధమేమిటి? అహల్యా, నీకోసం వచ్చాను; నీ విచారాన్ని నేను తీసుకొని అనుభవించవలెనని వచ్చాను; నీకు అను నయముకల్పించడానికి వచ్చాను; నాతో మాట్లా డవా ?

శిల : రా... ... ... ...మ్.

దేవేం: రామశబ్దోచ్చారణమే అది. ఈ శిల అణువులన్నీ తమ స్పందనములను ఏకముఖము చేసికొని రామశబ్దమును పలుకుచున్నవి. ఇంక నా కేమిగతి? అహల్యా, నామాట వినవూ ?

శిల : రా... ... ... ... ...మ్.

దేవేం: అహల్యా, ఏకాకినై దుఃఖముతో ఇట్లా కుమిలి పోవలసిందేనా నేను? నీవు శిలగా ఉన్నా నిన్ను నా అహల్యగానే భావించి పూజించ దలుచుకొన్నాను, అహల్యా; నా నందనవనమంతా నీపాదాక్రాంతము చేస్తా; నా ఐరావతమును నీకు కావలి ఉంచుతా; నా స్వర్గమును ఇక్కడికి తీసుకువచ్చి నీకు పరిచర్య చేయిస్తా, అహల్యా, మాటాడవూ ?

శిల : రా... ... ... ...మ్.

దేవేం: ఈ శిలలో అణువులన్నీ ఏకాగ్రనై ఒక రామశబ్దమును పుట్టించుటయందే లగ్నమైనట్లున్నవి ? ఎప్పటికైనా నన్నుద్దేశించి పలుకుతుందేమో ఈశిల—ఓపికతో కూర్చుంటాను.

శిల : రా... ... ... ...మ్.

దేవేం: చేతనా రహితమా ఈశిల?—కాన ట్లీకంపమే సాక్షి. జ్ఞానరహితమా? అయితే ఈ రామశబ్దం ఎట్లా పుట్టింది ! ఎంత విన్నా నాపేరు వినిపించడంలేదు. ఎంత పిలిచినా పలకడంలేదు. ఇంక ఈమెను ఎంత వేడినా లాభము లే దనిపిస్తోంది.

శిల : రా... ... ... ...మ్.

దేవేం: ఆశ్చర్యము—ఈ శిలతోకూడా ఈ మందారమూ ఈ పారిజాతమూకూడా స్పందించి రామశబ్దము కలిగిస్తున్నవి.

శిల : రా... ... ... ...మ్.

దేవేం: ఈ చిలకలూ, ఈ కోయిలలూ ఈ పక్షులన్నీ కూడా రామ నామమును పాడుతున్నవి. వాయు వీ వృక్ష శాఖలలో దూరి రామ నామమునే పుట్టిస్తూ వుంది! అహల్యా నాకు నీవు దిక్కు కాదా? నాతో మాటాడవా?

శిల : రా... ... ...మ్.

దేవేం: శిల నాతో మాటాడుతుందనే భ్రాంతితో రావడము నాదే తప్పు. ఈ శిల నా అహల్య కాదు! అయితే మాట్లాడే ఉండును— ఈ ఒక్కమారూ చూస్తాను, పోనీ మాటాడుతుందేమో! అహల్యా!

శిల : రా... ... ...మ్.

దేవేం: ఇక యిక్కడ నిలిస్తే నాకు కూడా రామశబ్దోచ్చారణ చెయ్య బుద్ధి పుట్టుతోంది. స్మృతి పథమున అహల్యను నిల్పించుకొని కొలుస్తూ వుంటాను; అదే నా కనునయ మిస్తుంది.—వెడతా అహల్యా!

శిల : రా... ... ...మ్.

దేవేం: మళ్ళీ రామ శబ్దమే! నా అన్ని ప్రశ్నలకూ రామ శబ్దమే ప్రత్యుత్తర మవుతున్నది—నేను వెళ్ళి పోవడమే మంచిది!

శిల : రా... ... ...మ్.

మందా: దేవేంద్రుడు వెళ్ళాడు—వట్టి కాముకుడు !

పారిజా: పాపం, ఈశిలకు మన ఆకులే చలవ కల్పించ వలెను కాబోలు.

మందా: మన రెమ్మలతో దానిని నిమిరి దానికి అనునయం కల్పించవలెను.

శిల : రా... ...మ్.

పారిజా: మనపక్షులు పాటలు పాడి దుఃఖోపశమనము చెయ్య వలెను.

మందా: మన పువ్వులు తమ సౌరభాలను కలుపుకొని భవిష్యత్తులో దానికి ఆశ కల్పించవలెను.

శిల : రా... ...మ్.

పారిజా: నిత్యమూ ఈశిలనుండి పుట్టే రామనామము వల్ల మన ప్రాంతమంతా పునీత మౌతుంది.

మందా: అంతే కాదు; భవిష్యత్తులో మనకు శ్రీరామదర్శనమే లభించబోతోంది, ఈశిల ప్రభావము వల్ల.

శిల : రా... ... ... ...మ్.

పారిజా: అప్పుడు మనకు మనపుష్పములద్వారా రామపాద స్పర్శ అనే మహాభాగ్యం తటస్థిస్తుంది—అంతకన్న కావలసిన దేమి ?

శిల : రా... ... ... ...మ్.

మందా: శిల ఎట్లా రామనామం పలుకుతోందో !

పారిజా: మనకు మాత్రం ఈమాట లెందుకు, మనమూ ఆపనే చేద్దాము.

శిల : రా... ... ... ...మ్.

మందా : రా... ... ... ...మ్.

పారిజా: రా... ... ... ...మ్

శిల : రా... ... ... ...మ్.

—□—

# జటాయువు

[దట్టమైన కీకారణ్యము. దండకారణ్యము. బ్రహ్మాండమైన చెట్లు, అక్కడక్కడ పెద్ద కొండలు. మధ్య మధ్య చిన్నవీ పెద్దవీ సరస్సులు. గోదావరీనది పుష్కలంగా ప్రవహిస్తోంది, ముత్యాలకోవ భూదేవి ధరించినట్లు. వివిధములైన పక్షులధ్వనులు దండకారణ్యము చెట్లలోనుంచి బయలుదేరి అంతరిక్షానికి ఎగిసిపోతూన్నవి. మృగముల అలజడి, ఆకుల వాసనలూ, పువ్వులపరిమళములూ, పెనవేసికొని అంతరిక్షాన్న ఆడుతూఉన్నవి. ఒక బ్రహ్మాండమైన రావిచెట్టు చివర కొమ్మల్లో ఒక చిన్నకొండవంటి పక్షి కూర్చున్నది. ఆ పక్షి జటాయువు. చింతాక్రాంత. ముదుసలి.]

జటాయువు : మనస్సులో పుట్టి మనస్సును చీల్చివేస్తున్న అనిర్వాచ్యమైన నావాంఛను* తీర్చుకోడానికి, అన్న-సంపాతితో పందెము గట్టాను. ఉభయులము సూర్యమండలము దాకా ఎగసిపోయినాము. ఫలము—నాకాపదరాకుండా నన్ను నా అన్న రెక్కలతో కప్పడము—నా అన్న రెక్కలు కాలిపోవడము—నేను స్మృతి తప్పి భూమిమీంద పడిపోవడము—స్మృతి వచ్చిన తర్వాత నామనస్సును పరిశీలించుకొన్నాను. నా వాంఛ తీరనేలేదు—ఎంతటి దారుణ వాంఛో అది—నా అన్నను బలిగా తీసుకొన్నది. నన్ను

*నోరి నరసింహ శాస్త్రిగారి 'పతంగ యానము' చూచేది.

కూడా బలిగా తీసుకొంటుంది కాబోలు—నాతో కూడా అంతరిస్తుంది కాబోలు... ఏమిటాశబ్దము?— అది పక్షుల పలుకా—కాదు. ఖగ సార్వభౌముడను పక్షుల పలుకులే గుర్తించలేనా? చల్లగా చెవులలో పడ్డదే ఆ పలుకు— హృదయములో ప్రవేశించి దహించివేస్తూన్నదే—నా వాంఛను రేపుతోందే— నా వాంఛనే బలిగా తీసుకోబోతోందే— ఏమిటా పలుకు—ఆలిస్తాను—

అంతరిక్షము : రామా, రామా, రామా.

జటా : దారుణమైన గాలి వానలో కోకిల పలుకు వినపడ్డట్లున్నది—ఏమిటి ఈ కోలాహలము— ఈ కోలాహలములో ఈ రామనామ మేమిటి? ఎక్కడినుంచి వస్తోంది యిది.

[మెడ జాపి రెక్కలు విప్పును.]

ప్రచండ మారుతమో అన్నట్లు విమాన మీ దారిన వస్తూన్నది— ఎవరో అందులో ఉన్నవారు... కాల మేఘము వలె నున్నాడు— ఎవడో రాక్షసుడు కాబోలు— ప్రక్క ఆ వాడిపోయిన పువ్వెవరో? కాంతి తరిగిన నక్షత్రమా? ఎవరో సుకుమారి వలె ఉన్నది— అంతకంత కా మూర్తి విస్పష్టముగా కాన వస్తున్నది - ఆ సుకుమారి భగ్నహృదయంనుండి బయలుదేరి, పెదవులనుండి వెలువడి, కన్నీళ్లతో తడిసి రామ శబ్దము నిర్గతమౌతూన్నది.

విమానము : రామా రామా రామా.

జటా : ఆ మూర్తిని చూడగానే నా తల్లి నాకు జ్ఞప్తికివస్తు న్నది. నా హృదయము పొంగుతోంది– ఆ రామ నామము నాకు ఉపదేశమూ, ఆదేశమూకూడా.

[రెక్కలను జాడించును.]

విమా: రామా, రామా, రావా, కాపాడవా, ఓ–మృగ ములారా, ఓ పక్షుల్లారా, ఓ వృక్షములారా– నన్నీ నీచుడు చెరబట్టినాడు– నా రామునితో నన్నెడ బాటు చేసినాడు– విన్నారా మీరంతా ? ఈ దారు ణాన్ని చూస్తున్నారా? ఈ అధర్మాన్ని సహిస్తారా? వింటున్నారా గోదావరీ! నా అవస్థ నా భర్తకు చెప్పవూ ? వింటున్నారా ? వృక్షములారా ? నారామునకీ సంగతి చెప్పరా? వింటున్నారా పక్షు ల్లారా? నా ఆపద కడ్డుపడరా ?
రామా– నా పిలుపు నీకు వినిపిస్తోందా– వాయు దేవుడా త్వరగా పరుగెత్తి ఈ నా పిలుపు నా భర్త చెవులో వెయ్యవు నాయనా? సౌమిత్రీ– రావోయి నాయనా త్వరగా మీ అన్నయ్యను తీసుకొనీ–పంచ భూతములారా ?

రావణుడు : చక్కనిది లంక సీతా. ఆ లంకలోని వైభవాలు స్వర్గములో లేవు సీతా. ఇంద్రుణ్ణి నీ సేవకుణ్ణి చేస్తా సీతా...

సీత ; రామా, రామా, రామా,

రావ : కోమలీ— అట్టి లంకలో నివాసము— ఇట్టి విమాన ములో యానము— నా వంటి సార్వభౌమునితో...

సీత : రామా, రావా రావా, రామా.

రావ : రాముడు మనుష్యమాత్రుడు సుమా తన్వంగీ !— నేనో రాక్షస సార్వభౌముడన్న— మనోహారిణీ ! రామునితో అరణ్య సంచారమా, రావణునితో లంకా వాసమా వివేకవతీ - నిర్ణయించుకో.

సీత : రామా, ఈ నా దుర్భరదుఃఖ మెట్లా తీరగలదోయీ; వినవుగదా నా మాటలు రామా. వినవుగదా నా మాటలు సౌమిత్రీ; వినరుగదా నా మాటలు ఓ మృగములారా; వినరుగదా నా మాటలు ఓ పక్షుల్లారా !

జటా : వింటున్నా, వస్తున్నా, అమ్మా, తల్లీ, సీతా— వస్తున్నా.

సీత : అహో, పన్నీటితో నా హృదయాన్ని తడుపుతున్నావు— ఎవరు నాయనా నువ్వు ?

జటా : వస్తున్నా తల్లీ, వస్తున్నా.

రావ : సూర్య బింబాన్ని ఆచ్ఛాదించి నా కడ్డుతగిలే ఈ మేఘ మెక్కడినుండి వచ్చిందో ?

సీత : నా పుణ్యము మూర్తీభవించి ఈ రూపమున వచ్చిందా ? రామా, నన్ను కాపాడవా ?

రావ : మేఘము కాదిది— నా విమానాన్ని ఆపివేసింది. అంతరిక్షానికి నావిమానం తీసుకుపోతున్నా డెవడో

ఈ బలశాలి— యెవడవురా నీవు లంకాపతి విమాన గమనాని కాటంకము కల్పించిన వాడవు? ఎరుగవా నా భుజశక్తి?

భయపడకు సీతా భయపడకు—

జటా : నీచుడా? ఎవ్వడవు నువ్వు, నాతల్లిని చెరబట్టి తీసుకు పోతున్నావు?

రావ : ఎరుగవా రావణుని — పులస్త్యుని మనుమని— త్రిలోకాధినేతను—యెరుగవా రావణాబ్రహ్మను— లంకాధిపతిని—

ఇప్పుడు తెలుసుకో— వదలు విమానం— మా యానము నడ్డగించకురా.

జటా : వాలి సందిట నలిగినవాడవు నీవేగా రావణా! నిన్నె రుగుదును, నా తల్లితో నీకేమి పనిరా, రావణా!

రావ : న న్నధిక్షేపించే నీ వెవ్వడవురా?

జటా : సంపాతి తమ్ముణ్ణి నేను; సూర్య సారధి అనూరుని పుత్రుణ్ణి నేను; విష్ణు వాహనుడైన గరుత్మంతుని అన్న కొడుకుని నేను; ఖగకుల సార్వభౌముణ్ణి. నేను నీ విమానాన్ని తీసుకొనిపోయి రాముని సన్నిధా నాన్ని పెట్టదలుచు కున్నానురా, రాక్షసుడా!

సీత : తండ్రీ! జటాయువూ! రామసన్నిధికి కొనిపోవయ్యా విమానం, నన్ను రాముని పాదముల వద్ద చేర్చ వయ్యా, నాయనా.

రావ : ఏల నీ కీ భయము జనక పుత్రీ! త్రిజగన్నేత నీ పక్షిగాడా ప్రతిఘటించేది!

ఓరీ పక్షీ! పండని భ్రమించి ఈ విమానాన్ని పట్టితి వేమో, విడవరా.

జటా : అధిక ప్రసంగము విహంగ జాతి లక్షణము కాదు. కాబట్టి ఒక్క మాట చెబుతున్నాను. నా తల్లిని సీతను వదిలిపెట్టు. నీయింటి మార్గము పట్టు. లేదా నా తీక్ష్ణనఖ చంచువుల దండన నీవు సహించలేవు సుమా రాక్షసుడా!

రావ : సీతా, భయపడకుమా; ఈ ముసలి పక్షికి బుద్ధిచెప్ప బోతున్నాను. నా పరాక్రమమెట్టిదో నీవునుచూతువు గాని— నిన్ను కోరిన ఈ లంకాధిపతి సామాన్యుడు కాడని నీవు చూచి మెచ్చుకొనుటకు మంచితరుణము వచ్చినది లే. నాపరాక్రమ విజృంభణము నీకుభయ కారణము కాకూడదు సుమా. ఆ రాముడే గొప్ప వాడనుకొని వరించావు కాబోలు—నేడు చూడు మా. రాముని మించిన పరాక్రమశాలిని—నేడు వరించవా, రాముని మించిన సుందరమూర్తిని సీతా—

సీత : అయ్యో ఎంత పాపము చేసుకొన్నవో, రామా, నాచెవులు. ఏల సహిస్తున్నావు వాయుదేవుడా, ఈ మాటలతో మలినమయి నా చెవి దూరుటకు— రామా, నీసతి కెంతటి దుర్యోగము పట్టిందో చూస్తు న్నావా! రామా నీ పాదముల వద్ద నన్ను చేర్చే వారెవర్నూ లేరా?

జటా : లేకేమి తల్లీ, నే వస్తున్నాగా! దిగులు పడకుమా అమ్మా, నారెక్కలలో శక్తివుండగా ఈ దురాత్మ గ్గుడు లంక వైపు నిన్నొక అడుగు మేరయినా తీసుకు పోలేడు తల్లీ!

రావ : విమానము ముందుకు బదులు వెనుకకు పోతున్నది. నావిమాన శక్తిని మించిన శక్తి ఈ పక్షికి యెక్కడ నుంచి వచ్చిందో!

జటా : శ్రీరామమూర్తి వర్ధనించిరా, రావణా.

రావ : అయితే యిప్పుడు చూతువుగాని రావణుని శక్తి యెట్టిదో.... భద్రముగా కూర్చోసుమా, సీతా! త్రుటిలో వస్తాను.

[రావణుడు ఖడ్గ పాణియై విమానమునించి బయటకు వచ్చి జటాయువుపై కత్తి దూస్తాడు. జటాయువు విమానము వదలి రావణునితో కలియ పడతాడు. సూతుడు విమానాన్ని దూరముగా నిలుపుతాడు.]

సీత : అయ్యో నాయనా, ముసలి పక్షివి ఆదురాత్మగ్గుడితో యెలాగ యుద్ధం చేయగలవు, నాయనా.

జటా : [ముక్కుతో రావణుని ఖడ్గమును విరిచి వేస్తాడు. గోళ్ళతో వక్షస్థలాన్ని చీరుతూ రెక్కలతో మొహాన్ని కప్పి బాహువులు తుండముతో ఖండించి వేస్తాడు.]

రావ : [బాహువులు మళ్ళీ మొలుస్తాయి. ఇరవై బాహువుల తోనూ, జటాయువుని పట్టుకొని రెక్కలు పెడవిరిచి మెడ నులివేసి దూరముగా విసురుతాడు.]

జటా : [సొమ్మసిలి పడిపోతుంటే]

సీత : అయ్యో నా తండ్రీ— రామా, ఈ నీచుడు నన్ను చెరబట్ట వలసిందేనా? అధర్మానికి రెక్కలు మొలిచి ధర్మము సొమ్మసిలి పడిపోవలసిందేనా? అయ్యో, ఈ ధర్మశీలునకు సహాయము చేసేవారెవరూ లేరా? నా యేడ్పు యెవరికీ వినపడ్డంలేదా? రామా! రామా!

జటా : భయము లేదు తల్లీ భయపడకు— నీ దీన వాక్యములు నా రెక్కలలో బలము పోస్తున్నవి—

రావ : [విమానము ప్రవేశించి విల్లూ బాణములూ తీసుకొని జటాయువును బాణములతో కొడతాడు]

జటా : పరంపరగా వచ్చే బాణాలను ముక్కుతోనూ, పాద నఖములతోనూ ఖండిస్తూ సమీపించి విల్లులాగి విరిచేస్తాడు. విమానాన్ని విరగగొడతాడు. గొడుగు లాగి వేస్తాడు, సూతుని మెడ కొరికివేస్తాడు.]

సీత : నా తండ్రి విజృంభిస్తున్నాడు — పక్షులు కల కల సంతోషిస్తున్నవి-ప్రకృతి ఉత్సాహముచెందుతోంది- నా హృదయములో ఆశాభాను డుదయిస్తున్నాడు; రామా, లక్ష్మణా ఈ పక్షికి సహాయం చెయ్యడానికి రారా, త్వరరాగా రారా.

జటా : [విరిగి పడిపోతూన్న విమానములోని సీతను జటాయువు రెక్కలతో పొదివి పట్టుతాడు. విమానం పెద్ద శబ్దముతో పడిపోతుంది.]

రావ : ఇరవై చేతుల్లోనూ యిరవై ఖడ్గాలు పట్టుకొని జటాయువుమీదపడి పాదములు నరుకుతాడు. జటాయువు

ఒక్క క్షణము అవకాశము కాగా సీతను రావణుడు లాక్కొని అంకము మీద నిలిపి పట్టుకుంటాడు]

సీత : అయ్యో! రామా, ఎంతపని జరిగిందో రామా; నా జటాయువు పాదములు తెగినవి. నన్నెవరింక రామా, కాపాడేవారు—— .

రావ : [సీతను పట్టుకొని లంక వైపు పారిపోతూంటే జంటలు జంటలుగావచ్చి చక్రవాకాలూ, పావురాలూ, పిచ్చికలూ, గువ్వలూ, గోరింకలూ అతనికి అడ్డుతగులుతవి. గుంపులు గుంపులుగానూ, బారులు బారులుగానూ చిలకలూ, కోకిలలూ, గ్రద్దలూ, బకములూ, పాలపిట్టలూ, నీటి పక్షులూ అతనిని చుట్టుముట్టుతవి. కత్తులు తిప్పుతూ వాటిని కొట్టుతూ దారిచేసుకొంటాడు]

సీత : ఏడీ నాజటాయు వేడీ; నా జటాయు సైన్యం నన్ను రక్షించ పూనుకొందా! రామా! ఈ తరుణం మించి పోనిస్తావా! నన్ను కాపాడడానికి రావా రామా.

జటా : [రావణుని వెనకే ఎగిరి వెళ్లి అతని వీపు ముక్కుతో పీకి గాయపరుస్తాడు. జుట్టు ముక్కుతో పట్టి అతన్ని ఆపుతాడు.]

రావ : [వెనుదిరిగి జటాయువుతో తలపడతాడు. పక్షులు వళ్లూ, జుట్లూ, చేతులూ, కాళ్లూ, చెవులూ పీకుతూంటవి. రావణుడు లక్ష్యపెట్టడు.]

జటా : రాజదార నపహరిస్తావురా నీచుడా! పరదారాపహరణము శ్రేయస్కామి చేయదగ్గదేనా దుర్మార్గుడా?

భర్త యింటలేనివేళ చోరుడవై లోకమాత నెత్తుకు పోతావురా చండాలుడా— ఇదిగో చూచావా, తెగిన నా పాదములశక్తి, ఇదిగో చూడు వజ్రతుల్యమైన నా తుండము బలము, ఇదిగో చవి చూడు దుష్టా, నా రెక్కలశక్తి—నా తల్లి బాష్పములతో నిండిన కన్నులు నీకు జాలి పుట్టించడం లేదా కఠిన హృదయుడా!

రావ : సీతా, నిన్ని చెట్టుక్రింద కూర్చోబెట్టుతున్నాను— భయపడక కూర్చో! సగము చచ్చిన ఈ పక్షికి స్వర్గ మిప్పించి వస్తాను.

సీత : [దిగాలుపడి చెట్టుక్రింద కూచుంది. పక్షులూ, మృగములూ ఆమె చుట్టూచేరి పర్ణశాలకు దారిచూపుతాము రమ్మంటున్నవి.]

రావ : నాకు నీతులు చెప్పేపాటివాడవా పక్షీ, నువ్వు! నీ పక్షికూతలు విన్నానులే; ఏదీ, నీ రెక్కల శక్తి.

జటా : [ఎన్నిమారులు బాహువులు ముక్కుతో ఖండించినా మళ్లీమళ్లీ బాహువులు మొలుస్తూండడంవల్ల ఏమి చెయ్యడానికీ తోచక సీతను పర్ణశాలకు తీసుకపోవచ్చునని సీతదగ్గిరికివచ్చి రెక్కలతో ఆమెను ఎత్తుకొనుచుండగా]

రావ : [వెనకే పరుగునవచ్చి జటాయువు రెక్కలు నరుకుతాడు. జటాయువు నేలమీదకు దొర్లిపోతాడు.]

సీత : [జటాయువు మీదపడి] నాయనా, తండ్రీ, జటాయూ నా మూలాన్ని నీకు పాదములు తెగినవా; నా

మూలాన్ని నీకు రెక్కలు తెగినవా; నా కోసము ప్రాణాలు విడుస్తున్నావా? తండ్రీ, నీ మేలు నే మరవగలనా? పరదారను రక్షించబూనిన నీ సనాతన ధర్మపరత్వమునకు శాశ్వతత్వము తప్పదు గదోయీ తండ్రీ—నీ సత్యబుద్ధి భావికాలమున కొజ్జబంతి కాగలదోయీ నాయనా! అయ్యో తండ్రీ యెన్ని గాయములో దేహమునిండా; నీ బాధా నివారణ మెట్లా చేయగలనో కదా; నా చీర కొంగుతో ఈ రక్తధారలు తుడుతునా; నా కన్నీళ్లతో ఈ గాయ ములు కడుగుదునా? నా చేతులతో నీ దేహము నిమురుదునా?

జటా : తల్లీ, సీతా, నా తల్లి చేతులవలెనే నీ చేతులూ చల్లగా నా దేహమునకు తగిలి బాధను తగ్గిస్తూన్న వమ్మా; నీ మాటలు నా తల్లి జోలపాటలు గావ టమ్మా! అమ్మా, ఈ దుర్మార్గుడు నిన్ను తీసుకుపో తాడు కాబోలు—శక్తి లేదుగదా, లేవలేనుగదా— ఏమిచేతునమ్మా—అయ్యో—నా తల్లి కుపకారము చెయ్యలేని ఎంతటి చేతకానివాణ్ణయితినో—అమ్మా, సీతా—శ్రీరామదర్శనార్థ మిక్కడే ప్రాణములు నిలుపుకొని ఉంటానమ్మా, నీ దీనావస్థ చెబుతా నమ్మా.

సీత : దారుణము గదా ఈ దుఃఖము— నారాముని అవస్థ తలుచుకొని దుఃఖించనా ?— నా నిస్సహాయ స్థితి

చూచుకొని దుఃఖించనా ?— నీబాధలు తలుచుకొని దుఃఖించనా ?— రామా.

రావ : రా, సీతా, పక్షిపై నీకంత ప్రణయమెందుకు ? రా సీతా,— లంకా వాయువులు వీస్తున్నవి— త్వరలో లంక చేరుదాము—

జటా : వున్నావ్రా, అక్కడ నీచుడా— (అని లేవబోయి క్రిందకు పడిపోవును.)

సీత : (జటాయువు మెడ కౌగలించుకొని) రెక్కలు తెగినా నన్ను కాపాడ ప్రయత్నిస్తున్నావా, తండ్రీ— నా తండ్రి జనకుని కన్న, నా తల్లి భూదేవి కన్న నీ వెక్కువ నామీద వాత్సల్యము చూపావు నాయనా; కాపాడ జాలక పోయావు నన్ను— యిప్పటిమట్టుకు పశు బలానికే యెక్కువ జయము కలిగిందిగా— నన్ను కాపాడ దలచిన యీ రెక్క లెంత ప్రియములో నాకు— నన్ను కాపాడ దలచిన ఈ నీ తుండ మెంత ఘనమైనదో— నన్ను కాపాడ దలచిన నీదేహ మెంత పవిత్రమైనదో? తండ్రీ, రాముని దర్శించు— నా అభాగ్య స్థితి చెప్పు—

రావ : (సీతను తల పట్టుకులాగుతూ) రావుగా, సీతా, లంకే శ్వరునిమాట మన్నింపవుగా, శాస్తి అనుభవిస్తావు సుమా.

సీత : అయ్యో, అయ్యో, జటాయూ, తండ్రీ, నన్నులాగు తున్నాడు. తీసుకుపోతున్నాడు. ఓ, గోదావరీ ! నన్ను

రక్షించవా! ఓ కొండల్లారా, ఓ మృగముల్లారా; వినరా నా యేడ్పు— రామునకు చెప్పరా— నా తండ్రీ జటాయూ, లేవ లేవు గదా, నాయనా, ఓ మునుల్లారా, ఓ దేవతలారా, ఈ అధర్మము మీకు గో చరము కావడంలేదా ?— రామా, ఎక్కడున్నావు,— యేడీ లక్ష్మణుడు—— అయ్యో.

రావ : (సీతను అంకముపై నిల్పి పట్టుకొని యెగిరి లంక దిక్కుకు పోతాడు)

సీత : జటాయూ, తండ్రీ... ...

జటా : (మెడ యెత్తిచూచి కోపముతో ఒక్కమారు బలమంతా ఉపయోగించి ఉవ్వెత్తుగా కొన్నిగజముల దూరము పైకిలేచి రెక్కలు లేక క్రిందపడిపోతాడు.) అయ్యో రామా !

రావ: చూచావా సీతా, నా బలోన్నత్యము—— కోపింపకుమీ సీతా, సీతల పట్టిలాగానని— చక్కనిది లంక, సీతా, ఆలంకలో వైభవాలు స్వర్గములో లేవు సీతా——

సీత : రామా, జటాయూ, తండ్రీ——

జటా : అమ్మా, సీతా, రామా !

సీత : (పైకి పోతూన్న సీత జడలోంచి ఒక పువ్వు ఎదురు తిరిగివచ్చి కృతజ్ఞతా సూచకంగా దీవనమై జటాయు శిరస్సున పడింది.)

(పక్షులు జటాయువును చుట్టుకొని బాధోప శమనార్థమై రామగీతములు పాడుతవి.)

సీత : (దూరమునుంచి అస్పష్టంగా) రామ్, రామ్, రామ్.

జటా : (ఆలించి) రామ్, రామ్, రామ్. నాతల్లి ఉపదేశ మంత్రమైన రామ మంత్రము వల్ల— పాంచభౌతిక మయిన రెక్కలు తెగిన నాకు— ఆధ్యాత్మికమయిన రెక్కలు మొలిచినవి.

నేనీ బ్రహ్మాండాలు దాటిపోగలను—సూర్య చంద్రాదుల దాటిపోగలను. పుణ్యలోకాల్లో నా రెక్కల కసితీరా సంచరించగలను.

శ్రీరామ శ్రీచరణ దర్శనార్థమై అందాకా ఈ నా రెక్కలు ముడుచుకొని యిక్కడ వేచి ఉంటాను.

నా తల్లి సీతమ్మ తనకు ప్రళయాగ్ని జ్వాల అనే మాట తెలియక ఆమూఢుడు ఆమెను తనకొంగులో మూట కట్టుకు పోతున్నాడు. వాడి పురాకృత కర్మ ఫలమై ఆహుతిచేస్తుందివాణ్ణి. నేను తప్పించగలనా? నా కుపకారియే అయినాడు. సీతాదేవికై దేహార్పణము చేయించాడు నాచేత ... ... శ్రీరామదర్శనం కాబోతోంది.

అన్నా సంపాతీ, నీవు కాపాడిన ఈ దేహము పవిత్ర కార్యానికై వినియోగపడింది చూశావా?

నా వాంఛ నేటికిగదా తీరింది! అన్నా నీ దగ్గరికి వస్తున్నాను సుమా — శ్రీరాముణ్ని దర్శించుకొని శ్రీరాముణ్ని పూజించుకొని—

రామ్, రామ్, రామ్.

—□—

# రేణుక

## ౧

జమదగ్ని : తెచ్చావా ?

రేణుక : ఆ !

జమ : ఇక్కడ ఆడుకొందామా ? ఆ బయలులోకి వెడదామా ?

రేణు : బయలులోకే వెడదాము.

జమ : ఇక్కడైతే చెట్లు దట్టముగా ఉన్నవి, నీడలో చల్లగా ఉంటుందిగదూ ?

రేణు : ఈ చెట్లల్లో నే పరిగెత్తలేనమ్మా. కాళ్ళన్నీ ముళ్లు గుచ్చుకుంటవి. చెట్లవేళ్ళు కాళ్ళకు తగులుకుంటే పడతాను కూడాను.

జమ : అయితే బయలులోకేపద. నా భుజశక్తి చూపడానికి ఇన్నాళ్ళూ ఈ వనములో వీలుపడిందికాదు - ఈ దినమున చూద్దువుగాని.

రేణు : మీభుజశక్తికీ నాజవమునకు ఈదినమున పందెమా ఏమిటి ?

జమ : అన్నమాటే ! మన పందెముమాట జ్ఞాపకముందా ?

రేణు : మీరు ఈ భయలులో విడిచిన బాణాలు నేను తెచ్చి ఇవ్వడమే కదా ?

జమ : నా వింటికి సంధించడానికి బాణము ఒక్కటే. బాణము విడిచీ విడవడంతోనే బాణంతోనే నీవు వెళ్లి త్రుటిలో తీసుకవచ్చి నా కివ్వాలి!

రేణు : ఇవ్వలేకపోతే?

జమ : జమదగ్ని భార్యకు ఇవ్వలేకపోవడమంటూ లేదు.

రేణు : ఆడదానికి ఇవ్వలేకపోవడమంటూ ఉన్నదా?

జమ : సామాన్య స్త్రీల కుండవచ్చు.

రేణు : నేను అతిమాత్రనా ?

జమ : నన్ను పెండ్లాడావు కాబట్టి!

రేణు : గమనమాంద్యము స్త్రీత్వ చిహ్నమని లోకులు చెప్పుకుంటా రేమి ?

జమ : మందవాయువులే ప్రచండమారుతము లౌతవి.

రేణు : నన్ను మందవాయువుగా ఉండనీయక ప్రచండ మారుతముగా ఎందుకు మార్చుతారు ?

జమ : ఒక రహస్యకార్యము నుద్దేశించి.

రేణు : సతులదగ్గరకూడా పతులకు రహస్యకార్యము లుంటవి కాబోలు!

జమ : నిన్ను వీరమాతగా చేయవలెనని!

రేణు : మీ తపస్సు నన్ను అట్లా చెయ్యలేదా?

జమ : నీలోవిలీనమై ఉన్న శక్తివల్లనే నీవు అట్లా కావచ్చునుగదా, ఇంక నా తపస్సును వెచ్చించడ మెందుకు?

రేణు : ఈ శక్తి నాలోనే ఉన్నదా? స్త్రీ సామాన్యమా?

జమ : స్త్రీ సామాన్యమే కాని... ... ...

రేణు : కాని ?

జమ : సరే, ఆ మాటెందుకూ ? వింటిని ఎక్కుపెట్టాలా. విల్లూ బాణమూ నాచేతికిచ్చి కాసుకో.

రేణు : 'కాని' అని ఏమో చెప్పబోయి మానివేశారు !

జమ : చెప్పాలా ?

రేణు : పోనియ్యండి చెప్పకపోతే!

జమ : మనము క్రీడారంగములో ఉన్నామా, లీలా గృహములోనా ?

రేణు : క్రీడా రంగము రణరంగము కాదుగదా!

జమ : రణరంగములో ఉత్సాహమూ ఆవేశమూ క్రీడా రంగములో చూపకపోతే నా ప్రయత్నములు వ్యర్థము కావా?

రేణు : క్రీడారంగమైనా, రణరంగమైనా, భార్యాభర్తలుండు స్థలము లీలాగృహ సదృశమే.

జమ : అందువల్లనే మనము భార్యాభర్తల మనే ఊహ తాత్కాలికముగా మరిచిపోదాము!

రేణు : అది అపాయకరము కాదా?

జమ : ఎట్లు ?

రేణు : ఒకచోట నా హృదయమును మీమీద లగ్నము చేసి ఇంకోచోట దానిని నాలోకి తీసుకొని, మళ్లీ ఇంకోచోట మీమీద లగ్నముచేసి—ఈ విధముగా

హృదయమును బాధపెట్టుతూ ఉంటే అది స్వేచ్ఛా వృత్తి నవలంబిస్తుందేమో ?

జమ : దౌర్బల్య లక్షణ మది !

రేణు: స్త్రీలకు మనోదౌర్బల్య మొక లోపముటగా ?

జమ : నీకు కాదు.

రేణు: ఎందువల్ల ?

జమ : నీవు నాభార్యవు కాబట్టి.

రేణు : వెనకటిమాట చెప్పారుకాదు ?

జమ : చెప్పాలా ?

రేణు : మీ యిష్టము.

జమ : నావంటి తపశ్శాలి నీ పజ్జఉండగా నీలో శక్తి వికసించి ధర్మ మార్గమున ప్రవర్తిస్తుంది.

రేణు : అన్యులమాట ?

జమ : అగ్నిదేవుడు మనకుపకారి. ఒకొక్కొక్కప్పుడు అపకారి కూడాను. అట్లే స్త్రీశక్తికూడా ! పగ్గములుపట్టి నడిపిస్తే రథాశ్వములు ఘంటాపథమునంటి పోతవిగదా.

రేణు : నాకు స్త్రీ పక్షపాతము సహజము. మీ విషయము నేను చెప్పలేను. కాని నాకు భయముగా వుంది.

జమ : ఏమని భయము ?

రేణు : స్త్రీ నని.

జమ : స్త్రీ వయితే ?

రేణు : నాలో శక్తివికసించి నాకు లొంగకుండా పోతుందేమోనని.

జమ : ఆ భయము లేదులే. ఆశక్తి మన అపత్యమును సంక్రమిస్తుంది.

రేణు : నా హృదయమును యెప్పుడూ మీ మీదనే వుంచకుండా వొకప్పుడు నాలోనికి నేను తీసుకుని కమఠవృత్తి అవలంభించి నట్లయితే—అమ్మయ్యో నాకు భయమవుతూ వుంది.

జమ : నేను అట్లా కోరినప్పుడు నీకు భయమెందుకు ?

రేణు : మీరు కోరినారు కాబట్టి అట్లా చెయ్యటానికి ప్రయత్నిస్తాను. కాని యిది అలవాటు అవుతుందేమో ? దానికి శిక్ష యెవరు అనుభవించడం ?

జమ : తప్పుచేసినవారే !

రేణు : నాకు భయము వేస్తూ వుంది. నాకు ఈ ఆటావద్దు, ఈశక్తీవద్దు.- అదేమిటిచెప్మా,- నేను వీర మాతనూ కావద్దు.

జమ : వెర్రిపిల్లా ! వీరమాత అనే గౌరవము లోకములో యెందరు స్త్రీలకు వస్తుంది ?

రేణు : యేమో.

జమ : లోకాలన్నింటినీ గడగడ లాడించే వీరశిఖామణి తల్లి అనే ఘనత యెందరికి రాను ?

రేణు : బ్రాహ్మణికి నాకెందుకా ఘనత ?

జమ : అవతార పురుషుని కనగల స్త్రీ లెందరున్నారీ లోకాన ?

రేణు : ఏమిటీ ?

జమ : లోక కల్యాణాన్ని చేకూర్చే ధన్యమూర్తి, భూ భారమును తగ్గించే ధర్మమూర్తి, ధర్మసంస్థాపనాన్ని చేసే అవతారపురుషుడు నీ గర్భమును జన్మభూమిగా చేసుకో బోతూ ఉంటే వద్దనే నీ వివేకానికి ఏమని సంతోషించేది ?

రేణు : నాకు ఏమో భయంగానూ, ఆశగానూకూడా ఉంది.

జమ : భయమును తరిమెయ్యి. ఆశనువృద్ధిచెయ్యి. మాతృత్వము స్త్రీలకు జీవితమున పరమావధి కాబట్టి ఆ స్థితిని అభిలషించే నీకోరికలను లేపు. ఇంక లేద్దామా ? విల్లు ఇలా తే.

రేణు : వింటిని నేను ఎక్కు పెట్టనా ?

జమ : వద్దు. బాణమునుకూడా యిలా తే. నారి మ్రోతకు భయపడకు. బాణవేగమున పుట్టిన శబ్దముతోకూడా నీ మంజీర నాదము నా చెవులలో బడవలెను సుమా?

రేణు : సరే.

జమ : వల్కలము వెనుకకు విరిచి కట్టుకో; ఉత్తరీయమును వక్షమునకు బిగించుకో. కచము నాలతలతో గట్టిగా కట్టుకో. సిద్ధముగా ఉన్నావా ?

రేణు : ఆఁ.

జమ : హంసకములు, కంకణములు తాటంక మేఖలాద్యాభరణములు భారముకావుకదా నీకు ?

రేణు : ఆభరణములు మాకు అవయవముల వంటివే!

జమ : ఈ ఉదయమున చల్లని మంద వాయువులో నీ కేశములనుంచి రాలిన పుష్పముల సువాసన కలిసి నా ఉత్సాహమును ద్విగుణీకృతము చేస్తూ వున్నది.

రేణు : పరస్త్రీని గురించి మీరట్టి వర్ణనలు చేయవచ్చునా ?

జమ : ఎవరు పరస్త్రీ?

రేణు : క్రీడారంగములో ప్రవేశించినప్పటినుంచి మనము భార్యాభర్తల మన్నమాట మరువ మన్నారు కాదూ?

జమ : వెంకి పిల్లా!

౨

రేణు : అమ్మయ్యా! ఇదిగో బాణం.

జమ : ఎక్కడ పడింది.

రేణు : మీరు చూస్తూ ఉండలేదూ?

జమ : బాణము దృష్టిపథాన్ని దాటిపోయింది కాని నీ విగ్రహము మాత్రము తళుకు తళుక్కున చుక్కలాగ కనిపించింది.

రేణు : బయలవతల దూరముగా ఉన్న ఆ శిఖవృక్షమును గుచ్చుకొన్నది పోయి.

జమ : బయలు దాటిపోయిందా; పాపం! ఇలా రా, ముఖం మీద ఆ చెమటబొట్లు ఈ కార్పాసములో తుడిచి వెయ్యనియ్యి. ఈమాటు అంతదూరంగా వెయ్య వద్దంటావా?

రేణు : ఏమి? చెయ్యి నొప్పి పట్టుతోందా ?

జమ : నీకు శ్రమ లేదన్నమాట!

రేణు : నేను వీరమాతను కాబోతున్నా కాదూ!

జమ : సరే, అయితే కాసుకో బాణము వేస్తున్నా. దాని మీదే దృష్టి ఉంచి పరిగెత్తు.

రేణు : ఉండండి. ఉండండి. ఇప్పటికి ఎన్నిమార్లు అయిందో లెక్క పెట్టుతున్నారా?

జమ : నీవు లెక్కపెట్టుతున్నావు కాదూ ఎన్నిమార్లయింది?

రేణు : పన్నెండుమార్లు.

జమ : దీనితో పదమూడు. పరుగెత్తు, పరుగెత్తు!

రేణు : ఇదిగో బాణం.

జమ : ఇంత చప్పున తెచ్చావేమి? నీ గమన వేగాన్ని పరీక్షించవలెనని బాణము నతివేగముతో పంపిస్తినే!

రేణు : పరీక్ష అయిందా?

జమ : ఆ, తెలిసింది. బాణమాగక ముందే మధ్యమార్గములో దానిని పట్టుకొని తీసుకువచ్చావు కాదూ?

రేణు : అవును పరీక్ష బాగా అయిందా?

జమ : ఆ బాణము వెళ్లి ఒక్కచోట కుత్సితమై ఉన్న భూభాగాన్ని నశింపజేసి యుండేది. ఇంకెప్పుడూ మధ్యమార్గములో దానిని పట్టకు. దానివల్ల భావి కాలాన అరిష్టము మనకు వస్తుంది సుమా!

రేణు : అయ్యో, మొదటనే నాకెందుకు చెప్పాను కాదూ?

జమ : ఇంకెప్పుడూ చెయ్యకు.

రేణు : దీనివల్ల నాకేమి ప్రమాదము వస్తుందో అని దిగులుగా ఉంది.

జమ : భావికాలాన జరుగబోయే కార్యాలకి ఇప్పటినుంచీ ఎందుకు బెంగ? ఇదిగో పదమూడోమారు వేస్తున్నా.

రేణు : ఇదిగో బాణం తెచ్చాను. ఈ బాణము మీరు చెప్పినట్లు రోగభూయిష్ఠమైన భూభాగాన్ని దగ్ధముచేసింది.

జమ : ఇదిగో మళ్లీ. నీవు గరుత్మంతుండిలాగ పరుగెత్తి తీసుకురా.

రేణు : ఇదిగో బాణం. అయ్యో, ఏమండీ పన్నగకులాన్ని భస్మంచేసిందీబాణ మా భూమి అంచులవనములో ప్రవేశించి!

జమ : రెక్కలుకట్టుకొన్న గువ్వపిట్టలాగ వెళ్లి ఈబాణాన్ని ఈమారు తే. వేస్తున్నా.

రేణు : ఇదిగోనండీ బాణం. ఈ మాటు ఈ బాణానికి నా మీద ఈర్ష్య కలిగినట్లుంది. నన్ను దాటవలెనని అదీ దాన్ని దాటవలెనని నేనూ పరుగులెత్తేము. చివరకు దాని ఈర్ష్య అంతా ఆ ముళ్లఅడివిపై చూపించింది.

జమ : చూచా, చూచా, ఆ బాణముకంటె నీవూ నీ కంటె నా హృదయమూ పరుగులెత్తినవి. ఇలారా, రేణుకా! విష్ణుదేవుడి చేతినుండి తప్పించుకొనిపోయే చక్రమువలె ఎంత చక్కగా వచ్చావు. ఈ చెమట తుడుస్తాఉండు. అన్నా, మొగం ఎంత కందిందీ! కళ్లు ఎర్రబడ్డవికూడాను. ఎందుచేత? ఎందుచేత?

రేణు : వెయ్యరేమి ఇంకో బాణం? చేతులు నొప్పులు పట్టిన వేమో ! ఒకమారు నాఒళ్లో పండుకోండి చేతులు పట్టుతాను.

జమ : శ్రమ అయితే చెప్పు రేణుకా, విశ్రాంతి పొందుదువు గాని.

రేణు : ఆట పూర్తి అయిన పిమ్మట విశ్రాంతి.

జమ : అయితే వేస్తున్నా బాణం, కాచుకో.

రేణు : పోనీ ప్రతీమాటు ఆ బాణాన్ని మీరు వెయ్యడం, దానికోసం నేను పరుగెత్తి తేవడం ఎందుకూ ? ఆ బాణముతోబాటు నన్నుకూడా నారికి సంధించండి; విడవండి.

జమ : మన్మథుడు ఇదివరలో నిన్ను తన వింటిలో పెట్టి నామీదికి వదిలిపెట్టాడు. నా హృదయ మప్పుడే అపహృత మైనది ... ...

రేణు : ఇది లీలా గృహము కాదుగదూ !

జమ : ఇదిగో బాణం వెళ్ళింది. నీవు వెళ్ళవేం?

రేణు : ఇదిగో వెడుతున్నా. దీనిని పట్టడ మెంత సేపు... ... ఇదిగో బాణం.

జమ : ఈమారు కొంచె మాలస్యము చేసే వేమి ?

రేణు : ఆలస్యము స్త్రీకి అలంకారము కాదూ ?

జమ : వేతునా బాణం ?

రేణు : మీ ఇష్టం.

జమ : కాంచన శలాకవలె మెరుపులు మెరుస్తూ వెళ్ళి....

* * *

ఇంత ఆలస్యం చేసిందెందుకు చెప్మా! బాణమువేసి యెన్ని త్రుటులైనదప్పుడే! ఎందుకోగదా ఈ ఆలస్యం.

రేణు : ఇదిగోనండీ బాణం!

జమ : ఎందుకైనదీ ఆలస్యం రేణుకా?

రేణు : ఏమో!

జమ : ఇలా దగ్గరసా రా, రేణుకా, కచభారముకు లతలు తెగినవి. ముంగురులు చెమట వల్ల మలిన మైనవి. ముఖంనుండి చెమట కాలవలుకట్టుతోంది. చంద్ర బింబంవంటి ముఖం ఉదయిస్తూ ఉన్న చంద్రబింబం వలె ఉంది. తల వెచ్చగాఉంది. ఈ దేహానికి ఇంత వేడి ఎందువల్లకలిగింది?

రేణు : ఏమో!

జమ : ఎంత కందినవీ నీ అరిచేతులూ? ఏవీ అరికాళ్ళు. లత్తుక ఎరుపా; కాళ్ళ యెరుపా ఇది?

రేణు : లత్తుక కొట్టుకుపోయింది ఈ ఆటలో.

జమ : అరికాళ్ళలో పొక్కులుకూడా. పొక్కినవి. ఎందు చేతా, ఎందుచేతా?

రేణు : ఆట ఉత్సాహములో గ్రహించ లేక పోయినాను నాథా!

జమ : ఆలస్యానికి కారణం తెలిసింది. ఎవడు నీకు అపచారము చేసినవాడూ ?

రేణు : సూర్యుడు నడి మింట నుండి నిప్పులు చెరుగుతున్నాడు.

జమ : ఏమిటీ, సూర్యునకు బుద్ధి లేదూ ? నేనూ నా భార్యా ఆడుకొంటున్నామని యెరుగడూ ? ఎవ తెగా భావించాడు నా భార్య నతగాడు ? ఊఁ ...

రేణు : ఆడదాన్ని చూస్తే భూతాలకు కూడా లోకువే.

జమ : ఏ భూతాలు నీకు ఇంకా అపచారము చేసినవి ?

రేణు : మాటవరస కన్నాను. ఈ సూర్యుడి వేడికే వాయువు తాళలేక వేడెక్కి దిక్కుతోచకుండా దుమ్ము రేపుకుంటూ పరుగెత్తుతున్నాడు.

జమ : జమదగ్ని బాణాగ్ని సూర్యుణ్ని మాత్రం భస్మం చెయ్యలేదా ? యేదీ రేణుకా, ఆ బాణం ఇలాతే !

రేణు : పాపం అతగాణ్ణి... ...

జమ : నాభార్య కపచారం చేస్తాడా ? తపింప జేస్తాడా నా భార్య దేహాన్ని ?

రేణు : ఈమాటుకు క్షమించండి, పాపం ! ఆట సాగిద్దామా?

జమ : బాణం ఇలాతే రేణుకా; నీకు తెలియదు. నీవూరుకో.

రేణు : ఇదిగో బాణం !

జమ : నా లక్ష్యమును మరుగు పరుస్తూ అడ్డముగా నిలుచున్న నీ వెవడవురా ?

బ్రాహ్మణుడు : రేణుకా! ప్రాణనాథా! నమస్కారము. తల్లీ, వందనము. నేను బ్రాహ్మణుడను మహామునీ!

జమ : బాణమున కడ్డులే! ఆదిత్యుడు నా కుటుంబిని కప చారం చేశాడు. శిక్ష ననుభవింప బోతున్నాడు. లే, అడ్డంలే.

బ్రా : క్షమించండి. నా తల్లిదండ్రులారా క్షమించండి. నా దేవతలారా క్షమించండి. ఎరుగక చేసిన తప్పున కిట్టి శిక్షలా మహాస్వామీ?

జమ : నీవు సూర్యుడవా ఏమి?

రేణు : బ్రహ్మ హత్యకొడిగట్టకండి సుమీ, ప్రాణనాథా.

సూర్యుడు : మేఘములు బారులుతీరి నా తల్లికి గొడుగు పడుతూనే ఉన్నవి. నా తల్లి దేహము బహు సుకుమారము కావడంవల్ల నావల్ల అపచారం కలిగినట్లు ఊహించ వీలుకలిగింది. నా తల్లికి అపచారం చేసే దుష్టుణ్ణా నేను ఋషీ!

జమ : నీవల్ల కాకపోతే ఎవరివల్ల కలిగినవి. ఈ కందడము, ఈ వేడి, ఈ బొబ్బలు, ఈ శోష నా ప్రాణ నాయికకు?

బ్రా : నాతల్లి అదితి ఒక్కటీ, నా ఈతల్లి రేణుక ఒక్కటీనా నాకు నా తండ్రీ.

జమ : నీతల్లికి కూడా అపచారముచేసే కఠినుడ వన్నమాట, నేనివ్వాళ గ్రహించాను. నాబాణముకు తిరుగులేదు. దాని ఆహారము నది వదిలిపెట్టుకోలేదు.

బ్రా : అపరాధం ఉంటేగదా శిక్ష, ధర్మమూర్తీ. నావల్ల అపరాధం లేనిదే నన్ను మీబోటి వివేకులు శిక్షి స్తారా మహర్షీ?

జమ : లోకచక్షునకు కళ్ళు లేవా నా భార్యకు కలిగిన శ్రమ చిహ్నముల గుర్తించడానికి?

సూ : సత్పథమున సంచరిస్తూ నా ధర్మాన్ని నేను నిర్వ హించడం వల్ల కొందరు తమకు అపచారం కలిగిం దని ఊహిస్తే తప్పు నాదా? అమ్మా, ఈకొడుకుపై మీకేనా దయలేదా?

రేణు : ప్రాణప్రియా!

జమ : రేణుకా, నీవు మాట్లాడకు. రవీ! నీవు సత్పథమున సంచరిస్తూ ఉన్నమాట నిజము. సత్పథమున సంచ రించే గృధ్రములకు భూమిపై కళేబరముల మీందనే కదా దృష్టి. సత్పథము సహజశీలమును మార్చ గలదా? ఇంక నీ ధర్మమును నీవు నిర్వర్తించేట ప్పుడు తనూ్మలమున సత్పురుషులకు అపకారము కలుగుతున్నదేమోనని ఊహించవద్దూ. లోకమునకు హానిని కలుగజేసే ధర్మమునకు అధరత్వస్థితిరాదా?

సూ : నా ధర్మాన్ని నేను సరిగా నిర్వర్తించడంవల్లనే కదా నాకు లోకబాంధవుడనే పేరు వచ్చింది.

జమ : యుక్తాయుక్త వివేకములేని నీ యొక్క నేటి ఈ ధర్మాన్ని ఎవడు ధర్మమనగలడు! జగజ్జననికాబోవు రేణుకపైనా తిగ్మాంశువులు! పరమపురుషుని పొత్తి

ళ్ళల్లో పెంచగల నా ధర్మపత్ని మీాదనా వేడి మయూఖములు! నీవట్రా లోకబాంధవుడవు! నీ అప చారానికి ఇదిగో శిక్ష అనుభవించు.

బ్రా : అమ్మా, నీకు నమస్కారము, క్షమించు. తండ్రీ, నీకు నమస్కారము. క్షమించు.

రేణు: క్షత్రియోచితమగు కోపశీలము బ్రాహ్మణులకు పట్ట రాదు...కాబట్టి ప్రాణనాధులకు ఒక్కమాట మనవి చెయ్యబోతున్నాను. ప్రాణనాయికను క్షమించగలరు ప్రాణప్రియులు.

జమ : ఏమిటీ రేణుకా?

రేణు : సూర్యుడు శిక్షింపదగ్గవాడైనప్పటికీ ఒక్కకారణము చేత క్షంతవ్యుడు.

జమ : ఏమిటీ? క్షంతవ్యుడా? ఈ సూర్యుడా? ఎందుకు అత నిపై నీకింత దయ, రేణుకా?

రేణు : అతన్ని చూడడంతోనే అతనిమీాద ప్రసన్నభావం కలిగింది నాకు ఎందువల్లనో?

జమ : ఓహో, అతని గర్భములోని నారాయణుడు నీ గర్భ మున ప్రవేశించ బోతున్నాడనా?

రేణు : ఏమో?

జమ : ఏమిటీ కారణమన్నావు?

రేణు : కారణమా? సూర్యుడు అపచారం చేసినట్లు మీారం టున్నారు కాని నేను అనలేదు కాదూ!

జమ : నేనంటే నీవన్నట్లుకాదూ!

రేణు : ఆటలో ఉన్నప్పుడు మీరు మీరే; నేను నేనే.

జమ : అతడు అపచారం చేసినట్లు ప్రత్యక్షంగా కనిపిస్తూ ఉంటేనే.

రేణు : ఆట ఉత్సాహములో నా కదేమీ తెలియ లేదు కాదూ?

జమ : తెలిసినా తెలియకున్నా అపచార మపచారమే: కాబట్టి శిక్ష నతడు పొందవలసిందే.

రేణు : అయితే శిక్షిద్దురుగాని, కాని ఆ బాణ మిలా ఇవ్వండి. అతగాడినే శిక్ష కోరుకొమ్మనండి.

జమ : సూర్యుడా, ప్రాణప్రియ ప్రియవాక్యములు నా కోపాగ్నిని చల్లార్చినవి. ఏమి శిక్ష కోరుకుంటావు నీవు.

సూ : తండ్రీ. నాతల్లికి కాళ్ళు కాలకుండా ఇవిగో పాద రక్షలు; తలకు ఎండతగలకుండా ఇదిగో ఆతపత్రము. నా ధర్మము నేను నిర్వహించుకోనూవచ్చును; మీ ఆట మీరాడుకోనూ వచ్చును. క్షమించరా.

జమ : రేణుకా, పాదరక్షలూ ఆతపత్రమూ పుచ్చుకో. ఆట సాగిద్దామా ?

సూ : తల్లిదండ్రులు నాకు సెలవు దయచేస్తారా ?

జమ : బ్రాహ్మణవేషముతో వచ్చిన ఓ సూర్యుడా; నీ ఎండలోనే నీవు మేము ఆటముగించేవరకూ ఉండు. అదే నీకుశిక్ష.

రేణు : ఆడవాళ్ళు ఇవి ధరించవచ్చునా ?

జమ : నీకోరకేదా సూర్యుడిచ్చాడు. అవి స్త్రీల వస్తువులే, పురుషులవికావు.

రేణు : అంటారుకాని చివరకు వీటి సదుపాయం చూచి మీరు పుచ్చుకుంటారేమోనని అనుమానంగా వుంది.

జమ : కొంటే !

రేణు : ఎన్నవదో ఈ బాణం తెలుసునా ?

జమ : ఎన్నవది ?

రేణు : పందొమ్మిదోది. వెయ్యండి బాణం. భూమి చల్ల గాను మెత్తగాను ఉన్నది. సూర్యుడు ఎండకాయడం లేనట్లే ఉన్నది.

జమ : వెళ్ళు ! బాణం తీసుకురా, చెప్పాలూ గొడుగూ చూచుకొంటూ నిలబడబోకు.

రేణు : ఎందుకు ప్రాణనాథుల కంత తొందర ! ఇదిగో బాణం.

జమ : కొత్త ఆభరణాలు గమనమున కడ్డురాలేదుగదా ?

రేణు : ఈ ఆతపత్రము విహగపత్రమైనది నా పట్ల. ఈ పాద రక్షలు రథచక్రములట్లయినవి. మీ బాణము మలినీ భూతవాయువును నిర్మలము చేసీ చెయ్యడంతోనే తీసుకువచ్చాను.

జమ : మళ్ళీ వేస్తున్నా బాణం కాసుకో రేణుకా.

రేణు : వెయ్యండి.

జమ : జాజ్వల్యమానంగా పోయే ఈ అస్త్రమేమి చేస్తుందో సరిగా చూచిరా; రేణుకా!

రేణు : ఇదిగోనండీ బాణం. ఇది లోకంలో ఉండే పాపాన్ని అంతా దహింపజేసినట్లు కనిపించింది. అమ్మయ్యా, తీసుకోండి బాణం.

జమ : ఇంకోమారు వేతునా బాణం.

రేణు : ఇరవై యొకటోమా రవుతుంది.

జమ : జగత్కల్యాణ హేతువైన ఈ బాణము నంటివెళ్ళి తీసుకురా రేణుకా.

రేణు : ఇదిగో బాణం. లోకమిప్పుడు సత్యధర్మాదులకు ఆవాసయోగ్యమై ఉన్నది. నేనింక పరుగెత్తలేను కాబోలు. కళ్ళుతిరుగుతున్నవి. మీ ఒడిలో పండు కోనియ్యండి ప్రాణనాథా !

జమ : రేణుకా, ఇవిగో నా బాహువులు నీకు శయ్యగా పట్టినాను.

రేణు : అమ్మయ్యా !

సూ : మహామునీ, నా తల్లి ఎందువల్లనో మహాతేజముతో ప్రకాశిస్తూ ఉంది. లోకోత్తరమైన ఈమె తేజస్సును నేను చూడలేకుండా ఉన్నాను.

జమ : ఆటలో అలసింది నాపత్ని. విశ్రాంతి పొందుతుంది. నీవు వెళ్ళు, సూర్యుడా !
రేణుకా, రేణుకా. ఈమె ఇంకా కన్నులు విప్పనే లేదు.

రేణు : ఏమండీ ఆట అయిందా, ఇంకో బాణం వేస్తారా?

జమ : లేచావా, రేణుకా. అయింది దాట. నీవు అలసినావు. ఇంకా కొంతసేపు నీవు నా బాహువులమీద విశ్రమించు.

రేణు : నేను బాగా పరుగెత్తలేదూ ?

జమ : జవమునకు నీవే పరమావధి వనిపించు కొన్నావు.

రేణు : ఈ పందెములో నా జవము గెలిచినదా; మీం బాహు బలమా ?

జమ : నీజవమూ నాబాహుబలమూ ధరించి సవితృమండలోద్భాసియైన ఒక దివ్య తేజశ్శాలి నీలో ప్రవేశించాడు.

రేణు : నిజంగా ?

జమ : నిజముగానే రేణుకా సూర్యుడు ఇప్పుడే వెళ్ళిపోయినాడు. మనబోంట్ల విషయములో అతడు చంద్రుడైనాడు.

రేణు : నేను వీరమాతను అవుతాకాదూ ?

జమ : వీరపత్ని వీరమాతకాదా మరి.

రేణు : సూర్యుణ్ని ఏమీ అనలేదుకదా పాపం ?

జమ : అనలేదు. చెప్పులూ గొడుగూ ఇచ్చినందుకే ఈ అభిమానం !

రేణు : సూర్యుడుకూడా నేనువీరమాతను కావడానికి తోడ్పడ్డాడు కాదూ ?

జమ : అవును.

రేణు : సూర్యుడంటే మీకు కోపం పోయిందా !

జమ : నీ మూలాన్నే అతనిమీద నేను కోపించాను. ఇప్పుడు మళ్ళీ నీమూలాన్నే అతన్ని అభిమానిస్తున్నాను.

రేణు : నామాట కూడా మీరు వింటున్నారు ఇప్పుడిప్పుడు!

జమ : నీవు వీరమాతవు కాదూ?

రేణు : ఈబయలిప్పుడు మనకు లీలాగృహమైనట్లున్నది.

జమ : ఆట ముగిసిందికాదు మరి.

—o—

# శర్మిష్ఠ

పూరువు : కొండమీదనుంచి కిందకు పడ్డట్లయినది. నిలబడదామంటే కాళ్ళాడవు. మాట్లాడదామంటే నోరు వణుకుతుంది. మనస్సుకు యౌవనము పోలేదు కాని శరీరముకు ముదిమి వచ్చింది.

శర్మిష్ఠ : అయ్యో తండ్రీ ఎంతపని చేశావురా!

పూ : కృష్ణా రామా అనుకుంటూ కూర్చుండవలెను కాబోలు. ఎప్పటికప్పుడు నాసంగతి నేను మరచిపోతున్నాను మొన్న నాన్నగారు వేటకు వెళ్లుతుంటే ద్రుహ్యూ అనువూ కూడా వెళ్ళుతున్నారని తెలిసి నేను ఉత్సాహము కొద్దీ గుర్రము నెక్కబోయి పడ్డాను. అన్నలిద్దరూ నన్నుచూచి నవ్వారు.

శర్మి : నవ్వరు నాయనా నీవుచేసిన పనికీ! తండ్రిగారికి కావలసి ఉంటే ఏ కోరికలేనా చెల్లించలేక పోయినావా? పదికాలాలపాటు బతకదలచినవాడవు, ముక్కుపచ్చలారనివాడవు, నీవయస్సు చేతులారా తండ్రి వశము చేస్తావా ?

పూ : తండ్రిగారిమాట ఎలా దాటేదమ్మా ?

శర్మి : తండ్రిగారిమాట అనుకొంటున్నావు; అది తండ్రిగారి మాట కాదు.

పూ : నన్ను తండ్రిగారు అడిగితేనేగదా నే ఇస్తి.

శర్మ : నీ తండ్రిగారికి ముసలితనమైనా ఒక్కటే; యౌవ్వనమైనా ఒక్కటే. దానికోసం ఇదంతాను - ఆ దేవయానికోసం.

పూ : దొడ్డమ్మకు ఇందులో ఏమీ సంబంధం లేదు. ఇమ్మనిగాని, వద్దనిగాని ఆవిడగారేమీ నాతో అనలేదు.

శర్మ : ఆవిడెప్పుడూ అనదు నాయనా! **అనకుండానే** అన్ని పనులు చేయించుకుంటుంది. చేయకపోతే తండ్రితో చెప్పి శాపము పెట్టిస్తుంది. పోనీ నాయనా, ఈ ముసలితనముతోనైనా బతికి ఉన్నావు చూచి సంతోషించడానికి. ఆవిడ శాపం గానీ తగిలినట్లయితే ఈ దుఃఖాలతోబాటు పుత్రశోకముకూడా అనుభవించవలసి వచ్చేది.

పూ : నే చేసిన పనికి దేవయాని దొడ్డమ్మ చాలా సంతోషించి నాకు బహుమానా లంపింది.

శర్మ : నేరకచేసిన చిన్నతప్పుకు ఆజన్మమూ నేను దాస్యము చేస్తున్నానుగదా; ఎటువంటి సుఖములూ ఎరుగనుగదా!

పూ : తండ్రిగారు నిన్ను గౌరవిస్తూనే ఉన్నారుగదా; ఇంక దుఃఖములమాట తలపెట్టడ మెందుకు?

శర్మ : నీతండ్రిగారు నన్ను గౌరవించారనేకదా నాయానా, నీకు ఈ అవస్థ వచ్చింది. నా జన్మము అంతా దానికి ధారపోశాను. నీ యౌవనమంతా నీవు నీ తండ్రి

ద్వారా దానికి ధారపోశావు. ఇంకా ఎంత వరకూ ఆవిడ మనను పీడించుక తింటుందో?

పూ : అమ్మా, ముదిమివల్ల అనుకోని దుఃఖాలు [illegible] వచ్చినవి. అందరూ తప్పలేనిదే నన్న సహ్యాంచుకొంటున్నారు. ఇంద్రియములు పట్టుతప్పినవి. ఇచ్ఛను తీర్చుకోలేని అశక్తికన్న పెద్ద దుఃఖ మింకొకటి ఉన్నదా?

శర్మ : కాదురా నాయనా, నా కడుపున నీవు పుట్టకపోయినా ఉన్నా బాగుండేది. దాని కడుపున పుట్టినా పుట్టావు కావు.

పూ : యౌవనపు ఇచ్ఛకు ఈ ముసలి దేహము బలముల నివ్వ గలదా? కొండలు తిందామనే ఇచ్ఛగాని పట్టుమ మెతుకులు లోపలికి పోవు. దేశాలు జయిస్తామని ఇచ్ఛ. దేహము కదలదు. దృష్టి శ్రవణములు సరేసరి చెప్పనే అక్కరలేదు. కాని ఒక్క సంతోషము మాత్రము నన్ను నిలబెట్టుతోంది.

శర్మ : సంతోషము కూడానా, నాయనా?

పూ : ఈ కష్టములన్నీ నా తండ్రిగారనుభవించవలసినవే కదా. అవి నేను పుచ్చుకొని తండ్రిగారికి యౌవన సుఖము ఇచ్చానుగదా అని సంతోషము.

శర్మ : నీమాటకు నే నెందుకు అడ్డుచెప్పాలి? ఆ స్వప్నసుఖమైనా నీకున్నందుకు నాకు మాత్రం సంతోషంగాదు నాయనా.

పూ : అమ్మా ఈ అవస్థలో నేను లోకము ముఖము చూడ లేను. ఏ అడవిలోనో ఒక కుటీరము నిర్మించుకొని భగవంతుని ధ్యానిస్తూ కాలక్షేపం చేస్తాను. యౌవన భానూదయం అయిన తరువాత మళ్లీ నీ ముఖం చూస్తాను. మనస్సును పగ్గములతో బిగించి ఈముసలి దేహముతో జతగూర్చి అందాకా జీవయాత్ర చేస్తాను.

శర్మి : నీతోకూడా వుండి నీకు గంజో అంబలో కాచిపోద్దా మన్నా ఈ దాస్యమువచ్చి పట్టుకుందినాకు. పుట్టింది మహారాజు కడుపున; అనుభవాలు ఎంతటి నికృష్టుల కైనా రానివి!

పూ : అమ్మా ! నీ దాస్య విమోచనమునకు మార్గము నాకు కనిపిస్తూవుంది.

శర్మి : ఏమిటి నాయనా ! ఏమిటి?

పూ : నాకు యౌవన ప్రాప్తికూడా దానితోపాటే కలుగు తుంది.

శర్మి : ఎలాగ.

పూ : గాలముకు ఎర్రను కట్టి పెద్దచేపను పట్టుతాడు గాలపు వేటకాడు. నా యౌవనమును బలిగా సమర్పించి నీకు దాస్య విమోచనమూ, నాకు సర్వాభీష్టములూ, సంపాదిస్తూ వున్నాను.

శర్మి : ఎందుచేత అలాగనుకొంటున్నావు ?

పూ : ఎంతటి కార్యమైనా బలిచేత నిర్వహించుకోవచ్చు గదా! ధనమూ, ప్రాణమూ, తపస్సూ బలిగాపెట్టి

ఆత్మ సౌఖ్యమూ, దేశ సౌఖ్యమూ, ముక్తి సంపాదించు కొంటున్నారు లోకులు.

శర్మ : నా దాస్యవిమోచనానికి నీవు నీయౌవనాన్ని బలిగా ఇచ్చావా ? నీ సౌఖ్యానికి నే నెన్ని దాస్యాలైన చేస్తాను గదా !

పూ : నా పుట్టుకకే నీశీలాన్ని బలిగా ఇచ్చావుగదా నీవు.

శర్మ : ఏమి నాయనా నీవే అలాగంటున్నావు ?

పూ : ధర్మ బద్ధమైన వివాహ ఫలముగా నేను జన్మించి ఉన్నట్లయితే ఈ మాట నేనెందుకంటాను ?

శర్మ : హృదయములుకలిసిన గాంధర్వము మా వివాహము.

పూ : లోకదృష్టికి మీ వివాహములో ధర్మము కనిపించ లేదేమో ?

శర్మ : మా వివాహానికి ఫలముగా మాకు ధర్మమే పుత్ర రూపముగా ఉదయించింది. ఇంక మా వివాహము ధర్మ బద్ధముగాక ఏమవుతుందీ ?

పూ : మీకు వుదయించిన ఆ ధర్మ మెవ్వరు ?

శర్మ : నీవే.

పూ : ఎట్లు ?

శర్మ : ధర్మముకోసమే నీ యౌవనము నీ తండ్రికి ధారపోశావు. ధర్మస్వరూపుడైన నా భర్త ముదిమి నీలో ప్రవేశించినాడు.
అందువల్ల నీలో నాకు నా భర్త కనిపిస్తున్నాడు. నీలో నా కొడుకు కూడా కనిపిస్తున్నాడు.

పూ : అమ్మా, ఈమాటలు నేనువినలేను. వెళ్లుతున్నాను.

శర్మి : నేను చెయ్యి పట్టుకుని తీసుకువెళ్లనా ?

పూ : వద్దు. నా తండ్రిగారు వస్తూన్నట్లు చప్పుడైంది. నే వెళ్లగలనులే.

శర్మి : జాగ్రత్త నాయనా. కర్ర గట్టిగా పట్టుకో తూలిపో యేవు. దారి సరిగా చూసుకొంటూ వెళ్లు, రాళ్లూ రప్పలూ తోవలో ఉంటేను. బళ్లూ రథాలు వస్తూం టవి-బాట పక్కనుంచి నడు.

పూ : జాగ్రత్తగానే వెడతానులే, అమ్మా.

(వెళ్లిపోవును. యయాతి ప్రవేశించును)

శర్మి : (తలవంచి నిలబడును. మాటాడదు)

యయాతి : నమస్కృతులతో స్వాగతము చెప్పవేమి నాకు శీలవతీ ?

శర్మి : (మాటాడదు.)

య : అన్యుల తప్పుకు నేనా, శిక్షా ప్రాత్రుడను కోమలీ ?

శర్మి : (మాటాడదు.)

య : అనుభూత సౌఖ్యములు స్మృతి పథమునకు రాగా కష్టములు రాగలవనే భయము కూడా విడిచి నా మనస్సు నీ దగ్గరికి లాగుకు వచ్చింది మనోహారిణీ !

శర్మి : (మాటాడదు.)

య : ఒక్క మాటకుకూడా నోచుకోలేదా నేను, ప్రాణ

శర్మ : నా బ్రతుకంతా తప్పులతో అల్లుకుపోయినది. నేను యేపని చేసినా, నాకో, నా వారికో కష్టములురాక తప్పదు. అందుకని నేను నీతో ఏమి మాటాడేది?

యు : కుశల ప్రశ్నలకు కూడా తగనా ?

శర్మ : నీకు నేను ఏ విధముగా నమస్కారము చేయ గలను. చేయడమునకు నా చేతు లాడవు. నా తప్పు వల్ల నాకు ఆజన్మ దాస్యము వచ్చింది. నా తప్పు వల్ల నీకు ముదిమీ, తరువాత నా చిన్న కొడుకుకు ముదిమీ వచ్చింది. నాకొడుకుల శ్రేయస్సు కోసము నేను మౌనము ధరించ పూనుకొన్నాను.

యు : నా కోసము ఈ ఒక్కమారూ వ్రతభంగముచెయ్యి.

శర్మ : లాభము ?

యు : నా హృదయ దాహము తీరుతుంది.

శర్మ : మొదటినుండి తుదవరకూ ఆత్మపరాయణత్వమేనా?

యు : ఆ ఆత్మలో నీవుకూడా ఇమిడి ఉన్నావుగదా !

శర్మ : మీరనుకొన్నట్లు కాను.

యు : ఎందువల్ల నీలో ఇంత మార్పు వచ్చింది.

శర్మ : నీకు ప్రబోధము కలుగడమునకు నేను మౌనవ్రతము త్యజిస్తున్నాను. ఇక మార్పుకు కారణములు చెప్పనా?

యు : హృదయదాహము అతిశయింపచేస్తున్నావా.

శర్మ : ఆత్మ! ఆత్మ లాభము తప్ప ఇంక ఏమీ లేదా నీకు?

య : అపచారములు చేసి వున్నట్లయితే క్షంతవ్యములైతే క్షమించు.

శర్మ : ఇప్పుడే నీవు ధర్మస్వరూపుడవని మన అబ్బాయితో చెప్పాను.

య : నిజంగా! అయితే ఇది ప్రణయ కలహమా?

శర్మ : ఎప్పుడైతే నీ ముదిమి అబ్బాయికి బదిలీ చేసి అతని యౌవనము నీవు గ్రహించావో - అప్పుడే అతని ధర్మము పెంపొందింది.

య : నాది క్షీణించిన దనా?

శర్మ : చెప్పడ మెందుకు?

య : ధర్మ లోపము కలిగినా పతివ్రతలు భర్తలను దూషించ వచ్చునా?

శర్మ : నీవు దేవయానికి భర్తవేమో? నాకు యిప్పుడు కావని నా నమ్మకము.

య : శుక్రాచార్య శాపము నిన్ను అలాగ అనిపిస్తూఉంది.

శర్మ : ఆశాపము మాట జ్ఞాపకమే ఉంటే నాదగ్గిరికి ఎందుకు వచ్చావు నీవు? ఒకమారు శిక్ష అనుభవించినవాడు రెండవమారు ఆ కార్యమే తలపెట్టినప్పుడు శిక్షకు వెరవవద్దా?

య : నీపై ప్రేమ బలాతిబలమై నన్ను లాగుకు వచ్చిందని ఇదివరకే చెప్పానుగదా!

శర్మ : శాప భయము నన్నా మాట అనిపించ లేదు.

య : మరి?

శర్మ : దేవయాని భర్త నాకు ఒకప్పుడు భర్తఅయినందుకే నేను వగస్తున్నాను.

యయ : దేవయానీ శర్మిష్ఠలు నన్ను కోరి భర్తగా చేసికొన్న వారే!

శర్మ : దేవయాని అంతకుముందు తన హృదయమును ఒక నికి అమ్మివేసింద.

యయ : కచ తిరస్కృత యని చెప్పుతున్నావా?

శర్మ : ఒకరికి అమ్మిన హృదయమును మళ్లీ నీ కెట్లు ధార పోయగలదో ఆలోచించుకొన్నావా?

యయ : ధారపోసిందిగాదా మరి?

శర్మ : కచుడే నేడు ఆమెకు చిక్కితే ధారపొయ్యడం నీకు బోధపడును.

యయ : మా ప్రేమజీవితములో కచునకు చోటు లేకుండా చేసుకొన్నాము.

శర్మ : నీ విషయములో ఆ మాట నిజమేమో, దేవయాని విషయములో నీవు నిర్ధారణగా ఎట్లు చెప్పుతావు?

యయ : ఆమె కచుణ్ణే నాలో చూచుకొంటూ ఉంది అనుకో.

శర్మ : నీతో వ్యభిచార మన్నమాట.

యయ : ఎంతటి మోటు మాటలు!

శర్మ : నీ చేతలో?

యయ : నా చేతల కేమి?

శర్మ : ఎందుకోసము నా దగ్గిరికి వచ్చావు?

యయ : చెప్పాను గాదా!

శర్మి : నాతో సరసా లాడుటకు వచ్చిన నీవు నాకేమి కావాలి?

య : భర్తను.

శర్మి : నాకొడకు యౌవనము కొల్లగొట్టి, ఆయౌవనములో నాకు సౌఖ్య మియ్యడానికి వచ్చిన నీవు నాభర్తవా? దేవయానికి భర్తవేమో ?
కచుని మోహించింది. నిన్ను చేబట్టింది. నీ ద్వారా నా కొడుకు యౌవనాన్ని ... ...

య : నీతి విరహితమైన మాటలు నీ నోట రావచ్చునా ?

శర్మి : నీతి విరహితమైన చేష్టలు నీతికి గురువైన శుక్రుని కూతురిలో నీకు కనిపించవు కాబోలు.

య : శర్మిష్ఠా, నీ ఊహకు అందని ఉత్కృష్టమైన నీతి వుండవచ్చునని నీ వెందుకనుకోవు ? వ్యక్తుల నీతులు సంఘమును కట్టివేయ గలవా ?

శర్మి : వ్యక్తినీతి సంఘనీతిని మించి వుండవచ్చు. అప్పుడు వ్యక్తినీతి సంఘ నీతిగా మారిపోతుంది.

య : మారే వరకూ సంఘనీతి మనకు అనుసరణీయము. పోనీగాని కోపము కట్టిపెట్టు. దేవయాని మాట మన కెందుకు ? ఆ నాడు నీవు నాకోసమని అనిమిషత్వము పూని కాచుకొని ఉన్న దినములు జ్ఞప్తికి తెచ్చుకో, ఆ ప్రేమలో ఆవేశమూ; ఆ ఆశలో ఆత్రతా; ఆ నిరీక్షణలో సౌకుమార్యమూ; ఆ నీ ప్రేమ నవనీత ములో తారళ్యమూ జ్ఞప్తికి తెచ్చుకో.

శర్మి : అది గత కాలము. అది గతసౌఖ్యము.

య : నా మీద పూర్వము వలె ప్రేమవర్షము వర్షించవా ఒక్కమారు.

శర్మి : కూడదు.

య : నేను నీ భర్తను కానా?

శర్మి : కావు.

య : ఎవరు నీ భర్త!

శర్మి : యయాతి మహారాజు.

య : నేను యయాతిని కానా?

శర్మి : నీ దేహము యయాతిది. నీ మనస్సు యయాతిది- ప్రేమకు నీ మనస్సును పురిగొల్పే యౌవనము నా కొడుకుది.

య : అయితే.

శర్మి : తెలియదా! నీలో నా కొడుకును నేను చూచుకొంటు న్నాను.

య : ఎంత చెడ్డమాట!

శర్మి : నా కొడుకు యౌవనము కొల్లగొట్టినపుడు ఈ ఊహ నీకు తోచలేదు కాబోలు!

య : నీ వల్లనేకదా నాకు శాపముతగిలి ముదిమివచ్చింది. నేను నా ప్రబిత్రింబమయిన నాకొడుకు యౌవనాన్ని ఎందుకు సంపాదించాను?

శర్మి : దేవయాని కోసము. నావల్ల నీకు ముదిమి వస్తే నా యౌవనమే నీవు తీసుకోలేకపోయావా ? యౌవనము నకు లింగభేదమున్నదా ?

య : నీ యౌవనము నేను గ్రహిస్తే అప్పుడు నా యౌవనము ఎవరియందు ఫలోన్ముఖము కాగలదు ?

శర్మి : ఇప్పుడో ?

య : నీవు కువ్యాఖ్యానములు కట్టి పెట్టితే—

శర్మి : నాకొడుకు యౌవనాన్ని అనుభవించేటంత దుర్నీతికి నేను ఒడబడలేను.

య : అయితే వెడతాను శర్మిష్ఠా.

శర్మి : పూరువు మీద దయలేదా ?

య : భర్తను తృణీకరించిన శర్మిష్ఠ కొడుకుమీద నాకు దయా !

శర్మి : తన బ్రతుకును చిచ్చుపెట్టుకొని తనతండ్రికి అమూల్య ధనము నిచ్చివేసిన కొడుకు మీద నీకు దయ వుండ రాదా ?

య : యయాతి కృతఘ్నుడు కాడు.

దేవయాని : (వెనుకనుండి గట్టిగా నవ్వును.)

# తిరుప్పాణాళ్వారు

మూలయ్య : ఎక్కడ కనిపించాడు నీకు ?

పుట్టయ్య : కావేరి నదిఒడ్డున కళ్ళుమూసుకు కూర్చున్నాడు.

మూ : ఇంటికి తీసుకు రాలేకపోయావా ?

పుట్ట : పలకరిస్తే పలకడు. కళ్ళుమూసుకు అదే కూర్చోవడం. తిండిలేదు; నిద్రలేదు.

మూ : మరేమి చేస్తుంటాడు అస్తమానం ఆ గట్టున కూర్చుని ?

పుట్ట : ఏమి చేస్తుంటాడని చెప్పను ? ఎప్పుడైనా కళ్ళు తెరిచినప్పుడు, 'రంగా, రంగా' అని ఒళ్ళు తెలియని కేకలు వేసి గంతులువేస్తూ ఉంటాడు.

మూ : బ్రాహ్మల్లో పుట్టవలసినవాడు మనలో తప్పి జారి పుట్టాడనుకుంటాను.

పుట్ట : అన్నిటి కన్న ఆశ్చర్యం ఏమిటో విన్నావా ?

మూ : ఏమిటా, ఆశ్చర్యం ?

పుట్ట : ఒంటినిండా దెబ్బలే. ఒళ్ళంతా రాళ్ళ దెబ్బలతో కదుములు కట్టింది. రక్తాలు కారుతూ ఉన్నా ఏమీ తెలియనట్లు 'రంగా రంగా' అనిఅరుస్తూ వుంటాడు.

మూ : రాళ్ళదెబ్బలెందుకు తగిలినవి ? కళ్ళుమూసుకు కావేరి గట్టున కూర్చున్న వాడికి రాళ్ళదెబ్బలకర్మమేమిటి?

పుట్ట : నిన్న ఉదయం బ్రాహ్మలు ఏనుగుమీద బంగారు బిందెపెట్టి కావేరికి నీళ్ళకోసం వచ్చారుట—

మూ : ఎందుకూ ?

పుట్ట : బ్రాహ్మణవాడలో శ్రీరంగనాయకుల దేవాలయం లేదురా ?

మూ : అవును; ఉంది, ఉంది—నీటి బరువుతో కరిగిన మేఘంలాగ దాని గోపురం ఆకాశం మీద కనిపించడం నేను దూరంనుంచి చూశాను.

పుట్ట : శ్రీరంగనాయకులను ప్రతి దినమూ కావేరీ జలంతో మజ్జనం చేయిస్తారుట.

మూ : అందుకా వస్తే బ్రాహ్మలు ?

పుట్ట : అప్పుడు రేవుపక్క ఇసుకలో పాణయ్య కళ్ళు మూసుకు కూర్చుని ఉన్నాడట.

మూ : బ్రాహ్మలువస్తే మరి లేచి దూరంగా వెళ్ళలేదూ ?

పుట్ట : ఎవరు వచ్చారో ఎవరు వెళ్ళారో వాడికేమైనా తెలిస్తేనా ?

మూ : ఏమిజరిగిం దప్పుడు ?

పుట్ట : బ్రాహ్మలు పాణయ్యనుచూసి లెమ్మని కేకలు వేశారుట. ఎంతలెమ్మన్నా లేవకపోతే రాళ్ళు విసిరారుట.

మూ : బ్రాహ్మలకు అడ్డంగా కూర్చుంటే విసరరు మరీ ?

పుట్ట : వాళ్ళు విసిరినరాళ్ళవల్లో, భక్త్యావేశంవల్లో పాణయ్య కొంతసేపటికి కళ్ళు తెరిచి బ్రాహ్మలందర్నీ చూచా

డట. చూచి తటాలున లేచి 'రంగా! రంగా' ఎంత మంది రంగళ్ళో ఎంతమంది రంగళ్ళో' అనివాళ్ళవైపు పరుగెత్తాడుట.

మూ : ఎంతపని చేశాడు !

పుట్ట : బ్రాహ్మలందరూ ఎక్కడ మీందపడతాడో అని నాలుగు దిక్కులా పరుగెత్తి వాడిమీందకు మరీ బెడ్డలు విసిరారుట.

మూ : పాపం తెలిసిచేస్తాడో తెలియక చేస్తాడో ఇలాంటి పనులు వాడు.

పుట్ట : తెలిసి, తెలిసి అలాగంటి పనులు చేసేవాడు కాడు మన పాణయ్య.

మూ : వాడికి దయ్యమే పట్టిందో భూతమే పట్టిందో మరి?

పుట్ట : ఆ దెబ్బలచేతో మరెంచేతో వాడు ఒళ్లు తెలియకుండా పడిపోయాడుట. వాడిని తప్పించుకుని బ్రాహ్మలు రేవుకువెళ్ళి నీళ్లు ముంచుకు వెళ్ళిపోయారుట.

మూ : వాడి సంగతి ఏమైనట్లు?

పుట్ట : కొంతసేపు అలాగ పడివుండగా వర్షం పడింది. అతడికి తెలివివచ్చింది. తెలివి వచ్చాక అతను నాలుగు వైపులా చూచి, 'అయ్యో! ఏరీ నారంగళ్లు, ఏరీ నా రంగళ్ళు' అని తల బాదుకు ఏడ్చాడుట.

మూ : అయ్యో, సత్యకాలమూ!

పుట్ట : అలాగ ఏడ్చి ఏడ్చి తరువాత తనను కొట్టిన రాళ్ళ న్నీ ఎంతో భయభక్తులతో పోగుచేసి, ముద్దు పెట్టుకుని, మళ్ళీ ఆ ఇసుకలోనే కూర్చుని ఆ రాళ్ళతో చుట్టూ ప్రాకారంలా కట్టి ఆ ప్రాకారంలో రంగనాథుడి దేవాలయం చిత్రించి, దాన్ని చూస్తూ 'రంగా, రంగా' అంటూ కళ్లు మూసుకొని ఒళ్లు మరిచి కూర్చుండి పోయాడు. .ఎవరెంత పిలిచినా పలకడు.

మూ : వీ డిలాంటిపనులుచేస్తుంటే మనందరికీ ఏమివస్తుందో అని నాకు భయంగా వుంది.

పుట్ట : మనమాటకేమి? వాడిమాట ఆలోచిస్తున్నాను, నేను! ఇది నిజంగా భక్తి అంటావా; పిచ్చి అంటావా?

మూ : తన్ను కొట్టిన రాళ్ళను భయభక్తులతో పోగుచెయ్యడం ఎందుకో?

పుట్ట : ఎందుకా? 'మా రంగళ్ళు నాకిచ్చారీరాళ్లు. మా రంగళ్లు నాకిచ్చారు. దీనితో నన్ను దేవాలయం కట్టుకో మన్నారు. నా రంగడికి వీటితో దేవాలయం కడతాను. మా రంగళ్ళు ఎంత మంచివాళ్ళు! మా రంగళ్ళకి నా మీద ఎంతదయ' అని వాడు అరుస్తూ కట్టాడుట ఆ ప్రాకారం.

మూ : ఇది పిచ్చిలాగే ఉంది నా మట్టుకు.

పుట్ట : రంగనాథుడి దేవాలయం ప్రవేశించి సాంతంగా రంగనాథుణ్ని తాను చూడకలుగుతే ఈ పిచ్చి పోతుందేమో అతనికి!

మూా : ఎందువల్ల?

పుట్ట : ఎరగవూ? చిన్నప్పణ్నించి ఏమనేవాడో! 'ఆ దేవాలయంలో రంగనాథుణ్ని మనం ఎలాగ చూడ్డాం? రంగనాథుడికి మనమీంద దయలేదా? ఉంటే మననెందుకు దూరంగా ఉంచుతున్నాడు? మనవిమాత్రం హృదయాలు కావా! మన కళ్ళుమాత్రం రంగనాథుణ్ని చూడవలెనని తహతహ పడవా? రంగనాథుణ్ణి చూడలేని ఈ జన్మెందుకు? ఈ జన్మలో రంగనాథుణ్ణి చూచి తీరతాను' అని.

మూా : అదే వాడికి పిచ్చి.

పుట్ట : ఈ పిచ్చికి మందేమిటో బ్రాహ్మలనే అడిగి తెలుసుకుందాము.

మూా : ఇది మన కులానికి అనర్థం కలగడానికే వచ్చింది. లేకపోతే రంగనాథుడేమిటి? బ్రాహ్మలుఅంటే ఎవరు? వారు కొలిచే రంగనాథుణ్ణి మనం కొలవడమేమిటి? బ్రాహ్మలకి అపచారంచేస్తే ఎంత పాపం!

పుట్ట : అవునుమరి. పాణయ్యకి పుట్టుకతోనే పుట్టింది ఇలాంటి బుద్ధి. ఇది మంచికే వచ్చిందో; చెడుకే వచ్చిందో!

మూా : అయినా దేవుడెక్కడ లేడు? ఆ దేవాలయంలో ఉండే రంగధాముడే తనకు కావాలనడం ఎందుకంట?

పుట్ట: ఏమని చెప్పను?

మూా : ఇదేదో అనర్థం కోసమే వచ్చింది.

పుట్ట : ఉండరా, ఉండరా - అదుగో చూడు బ్రాహ్మలు ఎందుకు చెప్పా మన మాలపల్లెకు వస్తున్నారు !

మూ : నే చెప్పలేదూ ? ఇదేదో మన కొంపమీదికి వచ్చే టట్లుఉంది. ఇక్కడ ఉండకుండా మన్ని పొమ్మనే అంటారో, శిక్షించనే శిక్షిస్తారో !

పుట్ట : బ్రాహ్మలు మాలపల్లెకు ఎందుకు రావాలో ? మన పాపంపండింది. బ్రాహ్మలు మాలపల్లెలో కాలు పెడితే ఆ పాపం ఎవరిదీ ?

మూ : ఊరుకో, మాట్లాడకు—ఈమూల నిలబడదాము రా; వాళ్ళకు అడ్డు నిలవరాదు.

పుట్ట : అలాగే, ఏమిచేసే దిప్పుడు ? చూడుచూడు. మన వాళ్ళంతా గొల్లున గోలపెడుతున్నారు. 'రావద్దు, రావద్దు స్వాముల్లారా! ఇది మాలపల్లి రావద్ద'ని. మనంకూడా రావద్దని కేకలు వేద్దామా ?

మూ : వేద్దాము ! లేకుంటే ఆపాపం మన్ని చుట్టుకుంటుంది.

పుట్ట : బాబుల్లారా ! ఇటురాకండి. ఇవి మాలకొంపలు, బ్రాహ్మలు రాకూడనివి.

మూ : స్వాముల్లారా ! రాకండి, రాకండి, చెప్పనిపాపం మాది చెపుతున్నాము. మీరు బ్రాహ్మలు - ఇవి మాలకొంపలు, రాకండి ఇటు రాకండి.

పుట్ట : తెలియక వస్తున్నారేమో, మా దేవుళ్ళు మీరు. రాకండి. ఇటురాకండి - ఇవి మాలకొంపలు.

(ఇద్దరు బ్రాహ్మలు ప్రవేశము)

(దూరముగా ఉండి పుట్టయ్య, మూలయ్య సాష్టాంగ పడతారు.)

మూ : బాబుల్లారా! క్షమించండి. తెలియకచేసిన తప్పులు. మా తప్పులు మీరు కాయకపోతే ఎవరు కాస్తారు?

పుట్ట : మా పాణయ్యకు చిన్నప్పటినుంచీ పిచ్చి. ఆపిచ్చిలో వాడు ఒళ్ళు తెలియని పనులు చేస్తూంటాడు. తప్పులు క్షమించండి. ఇకముందు వాడి విషయంలో జాగ్రత పడతాము.

దేశికాచారి : ఎక్కడరా పాణయ్య?

పుట్ట : బాబూ, వాడు పిచ్చివాఁడు. ఈమాటికి వాడి తప్పు కాయండి. మమ్మల్ని రక్షించండి.

మూ : తమరు వర్తమానం చేస్తే మేము రామా! తాము మా పాడుపల్లికి రావాలా; ప్రభువులు?

దేశి : ఏమిరా, అసందర్భ ప్రలాపము? ఎక్కడరా పాణయ్య?

పుట్ట : (మూలయ్య ముఖముకేసి చూసి మాట్లాడక ఊరుకొనును)

మూ : (చేతులు జోడించుకొని) రక్షించండి నా తండ్రులు. వాడు పిచ్చివాడు. వాడిని బతకనివ్వండి. ఈపాలికి మా తప్పు కాయండి.

దేశి : మూర్ఖుడా! ఏమిరా ఆ ప్రలాపము. చెప్పరా! పాణయ్య ఎక్కడ ఉన్నాడు. రాజుగారి ఆజ్ఞ అయిందిరా!

మూ - పు : అమ్మో! బాబో! మా కొంపలు మునిగేయి. రాజుగారి ఆజ్ఞ!

దేశి : అవునురా; ఇంకోగడియకు రాజుగారే వస్తారురా, పాణయ్యను చూడడానికి!

పుట్టి : రాజుగారు రావడమే! రాజుగారు రావడమే!

మూ : రాజుగారు స్వయంగా శిక్షిస్తారు కాబోలు. రాజుగారు స్వయంగా శిక్షించేటంత తప్పుచేశాడుకాబోలు పాణయ్య!

దేశి : శిక్ష ఎందుకురా మూర్ఖుడా! రాజుగారు స్వయంగా వచ్చి పాణయ్యను రథంమీద ఊరేగిస్తూ తీసుకువెడతారు.

పుట్టి : తెలియక అడుగుతున్నాను. క్షమించండి బ్రాహ్మణదేవుళ్ళు. మా పాణయ్యను శిక్షించడానికి కాదూ వస్తూఉంట రాజుగారు ?

దేశి : కాదురా, పాణయ్యను రంగనాథుడి దగ్గిరికి స్వయముగా తీసుక వెళ్ళడానికి వస్తున్నారు.

మూ : స్వాములు మనతో వేళాకోళమాడుతున్నారు. రక్షించండి - మీరే మా దేవుళ్ళు. మీరు తలచుకొంటే చెయ్యలేని దేమిటి?

దేశి : మీరు శుద్ధ మూర్ఖులు. చెప్పితే తెలియదా! పాణయ్యమీద రాజుగారికి దయకలిగింది. ఇకమాట్లాడక ఇక్కడికి అతన్ని తీసుకరండి. లేదా, రాజుగారు

వస్తున్నారని చెప్పి వాడిని సిద్ధంగా ఉండమని చెప్పండి ఇక మాట్లాడక వెళ్ళండి.

(మూలయ్య, పుట్టయ్య వెళ్ళిపోతారు)

వేదాంతం : ఈ మాలపల్లెలో కాలుపెడితే నాకు ఒళ్ళుగగర పొడుస్తూంది.

దేశి : ఎందువల్లనో?

వేదా: నా జన్మలో ఇటువంటి అకార్య కరణము చేస్తానని ఎప్పుడూ అనుకోలేదు. అందువల్ల- ఈ గగుర్పాటు.

దేశి : శ్రీరంగనాధ కటాక్షముచేత పావనమైనది కాదా ఈ మాలపల్లి ! ఇంకదీనికి రంగక్షేత్ర మహిమ కలిగిం దన్నమాట.

వేదా: అవును. కాని ఆమాట మనస్సు వినడంలేదు.

దేశి : ఆచారము ఒక్కొక్కప్పుడు, ధర్మాన్ని నాశనం చేస్తుంది. ధర్మము తెలిసివుండిన్నీ ఆచారానికి దాసుల మవుతున్నాము మనము.

వేదా: అవును. తెలియని విషయం కాదు. ఆ మాటకువస్తే భగవంతుడు లేని తావేది ? రంగధాముని కటాక్షమున మెలగనివారేరి? రంగధాముడికి జాతి మతాలు కావాలా; భక్తికావాలా ? ఇవన్నీ తెలిసిఉండినా ఆచారానికి భిన్నంగా ప్రవర్తించడమంటే మనస్సు ఒప్పుకోదు.

దేశి : అది మానవస్వభావమేమో? లేక పూర్వార్జిత కర్మ ఫలమో ?

వేదా: ఈ కలికాలంలో ఇటువంటి వింతలు పుట్టడంమాట చెప్పు?

దేశి : రంగనాథుడు కావేరీతీరవాసి, ప్రత్యక్షదైవం. ఇంకా సందేహముందా?

వేదా: పాణయ్యనుకొట్టిన దెబ్బలు రంగనాథుడి వంటిమీంద కనిపించడం మాట చెప్పు?

దేశి : పాణయ్య ఎవడో మాలవాడనుకున్నాము కాని, ఇటువంటి భక్తాగ్రేసరుడని ఎవ్వరూ అనుకోలేదు.

వేదా: రంగనాథుడి కటాక్షంవల్ల ఒక భక్తాగ్రేసరుడు మనకు తెలిశాడు.

దేశి : అంతేకాదు; భక్తుడూ భగవంతుడూ ఒక్కటే అని కూడా నిరూపించాడు శ్రీరంగధాముడు.

వేదా: ఎంత మహత్తు, ఎంత మహత్తు! మన శ్రీరంగనాయకుల వారిది!

దేశి: మానవులు ఆవేశప్రియులూ ఆచరణరహితులూ కావడంవల్ల రంగనాథుడే రాజుగారికి కలలో స్వయముగా ప్రత్యక్షమయ్యాడుట!

వేదా: కాకపోతే పాణయ్య రాళ్ళదెబ్బలకు ప్రాణాలు విడిచిపెట్టవలసినవాడే.

దేశి : అగ్రజాతుల భక్తిలేశము అతిమాత్రముగా మనము వర్ణిస్తాము; అంత్యజాతుల అవిరళ భక్తిని తృణీకరిస్తాము. ఈ లోపము సవరించడానికే శ్రీరంగధాముడు రాజుగారికి కలలో కనిపించి ఉంటాడు.

వేదా: తనతోపాటు తన భక్తుణ్ణికూడా ప్రజలు పూజించవలె నని అట్లా చేసి ఉంటాడు, రంగనాథుడు.

దేశి : పరిమిత జ్ఞానముతో సర్వజ్ఞుని ఊహాలు గ్రహించ డానికి ప్రయత్నిస్తున్నాము మనము.

వేదా: జన్మదోషమో, వర్ణదోషమో కాని భగవంతుణ్ణి మనమే గుత్తగొంటున్నాము. మనము కట్టుకున్న ప్రాకారాల మధ్యనే భగవంతుణ్ణి బంధించగోరే మన ఊహాలు తప్పని ఇప్పుడు బోధపడింది.

దేశి : భగవంతుని కౌగిలి మానవుల కందరకూ క్రీడారంగ మన్న మాట ఇప్పుడు తెలిసింది.

వేదా: కాని ఒక మాటచెప్పుతాను, విను. పాణయ్యను మన మిప్పుడు మన కూటములో చేర్చుకుంటాము గాని పాణయ్యలాంటివాడు ఇంకా ఒక్కడు పుడితే మళ్ళీ వానిని రాళ్ళతో రువ్వుతాము; తప్పదు.

దేశి : మళ్ళీ రంగనాథుడు తనమహత్తు చూపాలి. అందాకా ఒప్పుకోము. ఆమాట నిజమే!

వేదా: దినమూ రంగనాథుణ్ని పూజించే ఆ పూజారికంటె దూరాన్నించి రంగధాముడి ఆలయగోపురముచూచే ఆ మాలవాడికి భక్తి ఎక్కువ పుడుతుందికాబోలు!

దేశి : రంగనాయకుడి దయవల్ల భక్తే అగ్రవర్ణ లక్షణ మని బోధపడింది. ఈ తరమువారి కుబుద్ధు లింత టితో అంత మొందినట్లే!

వేదా: తరువాతి తరములవారు దీని నీతిని స్మరించుకోక ఆచారమునకు దాసులౌతారుసుమా ?

దేశి : రాజుగారు వస్తూన్నట్లు తూర్యధ్వనులు వినిపిస్తూన్నవి.

వేదా: ఇంకా పాణయ్యను వాళ్ళు తేలేదు. ఏమిచేస్తున్నారో ఈ మాలవాళ్ళు ఇంతసేపటినుంచీ !

దేశి : ఈనాడు పాణయ్య హృదయపుష్పాన్ని రంగనాధుడి పాదపద్మాలమీద అర్పిస్తాడు.

వేదా: ఇదివరకే చేశా డాపని. పాణయ్యకులమువారి కీనాడు రంగధాముడి దర్శనభాగ్యము లభిస్తుంది. రంగధాముడి కటాక్షవీక్షణములతో స్నానముచేస్తారు వారు.

దేశి : వైష్ణవాగ్రగణ్యులౌతా రీ రోజున వారు. అదుగో, అదుగో పాణయ్యను వాళ్ళు లాగుకొస్తున్నారు.

వేదా: ఆ గోచీగుడ్డతో వాడిని రాజుగారి ఎదుట ఎలా పెట్టడం !

దేశి : ఆ భక్తశిఖామణికి ముస్తాబు ఎందుకు ?

వేదా: భక్త్యావేశమే అతని ముస్తాబు.

(మాలయ్య, పుట్టయ్య, పాణయ్య ప్రవేశం)

పాణ : వదలండి, నన్ను వదలండి. నా రంగడి దగ్గరికి నేవెళ్ళిపోతాను, నన్ను వదలండి. ఏడీ రంగడు ? ఏడీ, ఏడీ ? కావేరీ నదిగట్టున కూర్చున్నాడు నా రంగడు. నన్ను రమ్మంటున్నాడు – నే వెళ్ళిపోతా.

పుట్ట : ఉండరా పాణయ్యా. ఎందుకు పెనుగులాడతావు ? నీ కోసం బ్రాహ్మణులు వచ్చారు చూడరా !

పాణ : వచ్చారా, నా రంగళ్ళు వచ్చారా! నాకోసం వచ్చారా, నా రంగళ్ళు! నా రంగళ్ళు నన్ను దేవాలయం కట్టుకోమని నాకు రాళ్ళు ఇచ్చారు. కాదూ? నా రంగళ్ళకు మొక్కుకుంటాను. ఏరీ నా రంగళ్ళు! (అంటూ వైష్ణవుల పాదాలమీద పడును)

వేదా: ముట్టకు, ముట్టకు (అని దేశికుణ్ణి చూచి నాలుక కరచుకొని) లే పాణయ్యా, లే. నీ కోసం రాజుగారు వస్తున్నారు.

దేశి : నిన్ను రంగనాయకుల దగ్గిరికి రాజుగారు స్వయముగా తీసుకెళతారుట; అదుగో రాజుగారు వస్తున్నారు.

పాణ : (సంతోషంతో గంతులువేస్తూ) నన్ను రంగనాథుడి దగ్గరికి తీసుకు వెళతారా ! రాజుగారు వస్తున్నారా ! నా రంగనాయకుణ్ని నేను దేవాలయములోచూచుకో వచ్చునా, నేను కొలుచుకో వచ్చునా,— రంగ నాయకుణ్ని.

దేశి : ఆ ! సందేహం లేదు.

వేదా : నిన్నుచూస్తే రంగనాయకునికి చాలా ప్రీతి.

పాణ : రాజుగారు ఎందుకు పిలవడం నన్ను ? నా కిక్కడ నా రంగనాథుడు లేడా ? నా కీ రంగడు చాలడూ ? నా రంగడు కావేరీ తీరాన్ని ఇసుక తిన్నెలమీద ఆడుకొంటున్నాడు. నేను రంగడిదగ్గరికివెళ్ళిపోతాను. నా రంగణ్ణి నేను కొల్చుకుంటాను.

దేశి : నీవు వెళ్ళిపోకు. రాజుగారికి కోపంవస్తుంది.

వేదా: నీవు వెళ్ళితే నిన్ను శిక్షిస్తారు సుమా!

పాణ : నాకొద్దు దేవాలయంలో రంగడు. ఆరంగడు బ్రాహ్మణ రంగడు. నే నాఆలయంలోకి వెడితే బ్రాహ్మలకి కోపం రాదూ! బ్రాహ్మలకు కోపంవస్తే నాకు పాపంరాదూ? బ్రాహ్మలకు కోపంవస్తే నా రంగడికి నా మీాద కోపంరాదూ! నాకీ రంగడేచాలు. నా రంగడితోనే నేనాడుకొంటాను.నారంగణ్ణినేను కొలుచుకొంటాను.

దేశి : నీవు దేవాలయంలోకివస్తే బ్రాహ్మలకి కోపంరాదు. వెయ్యి మంది బ్రాహ్మలు రాజుగారి వెంట వస్తు న్నారు-నిన్ను తీసుకెళ్ళడానికి.

వేదా: రంగడు నిన్ను తీసుకురమ్మని వారితో చెప్పాడుట.

పాణ : బ్రాహ్మలే వస్తున్నారా నా కోసం? అమ్మో, బ్రాహ్మణ దేవుళ్ళు మాల ఇంటికి రావచ్చా? రంగడు నన్ను తీసుకు రమ్మన్నాడా? నిజంగా, నిజంగా? నా రంగడే నన్ను తీసుకురమ్మంట? నా రంగడే!

దేశి : రంగడి ఒంటికి నిన్ను కొట్టిన దెబ్బలు తగిలాయట!

పాణ : ఎవరి వొంటికీ?

వేదా: శ్రీ రంగనాయకులవారి వొంటికి.

పాణ : ఎందుకు తగిలాయి?

దేశి : మేము నిన్ను రాళ్ళతో కొట్టాము కామూ? ఆ దెబ్బలు రంగడికి తగిలాయిట.

పాణ : అమ్మో, అమ్మో మా రంగడికి నా దెబ్బలు! నా కెందుకు తగిలేయి కావు ఆ దెబ్బలు? నాయీ పాడు దేహానికి తగిల్తే అది భగవ దారాధనకు స్వాధీన మయ్యేదే! నా రంగడికి దెబ్బలు తగిలాయా? అయ్యో, అయ్యో! (ఏడ్చును)

దేశి : రంగడు రాజుగారికి కలలో కన్పించి నిన్ను దేవా లయంలోకి రమ్మన్నాడుట!

పాణ : నిజంగా, నిజంగా!

దేశి : నిజమే.

పాణ : మా రంగడు నన్ను దర్శనం చేసుకో మన్నాడా? నిజంగానే!

పుట్ట : నిజంగానే.

పాణ : శ్రీరంగనాయకులవారికి ఎంతటి ఆశ్రిత పక్షపాతం! నన్ను రమ్మన్నారా? నన్ను రమ్మన్నారా? నిజంగానే?

మూలః నిజమే నటయ్యా!

పాణ : నా రంగయ్య నన్ను దేవాలయంలోకి రమ్మన్నాడు నిజమే. ఇన్నాళ్ళకి నా దేవుడి దర్శనం నాకవుతుంది. ఇన్నాళ్ళకు నేను కరువుతీరా నా రంగణ్ని చూచుకుం టాను. రంగణ్ని చూడని ఈకళ్ళెందుకు నాకు? రంగణ్ని మొక్కని ఈ చేతులెందుకు నాకు? రంగణ్ని పలకని ఈ నాలు కెందుకు నాకు? రంగణ్ని తలవని ఈహృద యమెందుకు నాకు? రంగణ్ని నేను మనసారా కొలుచు

కుంటాను. నా రంగడు నన్ను రమ్మన్నాడు. బ్రాహ్మలు రంగణ్ని చూడమన్నారు నన్ను. నా రంగడే నన్ను రమ్మంటున్నాడు. నేను వెడుతున్నా! నేను వెడుతున్నా! నా రంగడిని చూచుకొంటాను. నా రంగణ్ని పూజించుకుంటాను. వెడుతున్నా నా రంగడి దగ్గరకు. రంగా, రంగా, నాతండ్రీ, ఓ రంగా వస్తున్నా నీ ఒళ్ళోకి. వస్తున్నా నాయనా నిన్ను మొక్కుకోవడానికి! వస్తున్నా ప్రభూ! నీ పాదం దగ్గరికి! వస్తున్నా రంగా, వస్తున్నా,రంగా, రంగా.

(అని వెళ్ళిపోవును)

దేశి : రాజుగారు వాయిద్యములతో వస్తున్నారు. ఆగు! పాణయ్యా ఆగు.

వేదా: వెయ్యిమంది బ్రాహ్మలతో కూడా వస్తున్నారు.

పుట్టు : ఆపేదా, బాబూ—వాణ్ని ?

దేశి : పట్టుకోండి; పట్టుకోండి.

పుట్టు : మాలయ్యా, ఆగరా, ఆగరా; ఆగర్రా పాణయ్యా! (అని పరుగెత్తిపోతారు)

వేదా : మరి వాణ్ని వీళ్ళు పట్టుకోలేరు! మనం ఇక్కడ ఉందామా; వెడదామా ?

దేశి : రాజుగారు వస్తారుగా! వారికీ వర్తమానం చెప్ప వద్దూ ? ఆగుదాములే!

వేదా: చూడు, చూడు. వాడు మాలపల్లిలో జనాన్ని అందరినీ తీసుకపోతున్నాడు – రంగనాయకుల గుళ్లోకి!

గంతులు వేస్తున్నాడు! పాటలు పాడుతున్నాడు! మాలవాళ్ళందరూ అతనితో కలిసి పాడుతున్నారు!

దేశి : వెయ్యిమంది బ్రాహ్మలు వాణ్ని చుట్టవేసి పట్టుకొన్నారు చూడు, చూడు. ఔరా! ఆశ్చర్యం! వాడి పాదాలకు మొక్కుతున్నారు, వారంతా!

వేదా: మనమెంత తప్పుచేశాం! వాడి పాదాలకు మొక్కవలెననే తోచిందికాదు మనకు!

దేశి : అది మన దౌర్భాగ్యం. మన పూర్వకృత కర్మ దాటడం ఎవరి శక్యం—చూడు. చూడు, వాడిని రాజుగారి రథంలో రాజుగారి ప్రక్కన కూచోబెట్టారు. రాజుగారు అతన్ని కౌగలించుకొంటున్నారు.

వేదా: పాణయ్య రథంలో మూర్ఛపోయాడు—చూడు.

దేశి : ఓహో! ఎంతటి దివ్యదృశ్యము! ఎంతటి పుణ్యదినము! మాలలూ బ్రాహ్మలూ కలిసిమెలిసిరథంవెనుక రంగనాయకుల దేవాలయానికి వెళ్ళుతున్నారు- చూడు.

వేదా: మాలలు పాటలు పాడుతున్నారు. బ్రాహ్మలు స్వస్తివాచకములు చెప్పుతున్నారు. రంగడిపేరు మిన్నుముట్టుతోంది.

దేశి : వెడదాం పద; మనంమాత్రం ఇక్కడ ఒక్కళ్ళమూ ఉండడ మెందుకు? రంగడి ఉత్సవములో మనమూ కలుద్దాము.

వేదా: పద, చప్పున పద.

# కాంచీ కుమారి

## ౧

రాజు : గుర్తించారా నా ఆజ్ఞ?

మంత్రి : చిత్తం.

రాజు : ఎందు కింకా సందేహిస్తారు?

మం : తమ కన్నివిధములా భృత్యుడైన యీ మంత్రి ఏమిన్నీ సందేహము లేదు——కాని——

రాజు : కాని?

మం : ఈ మంత్రిలో సర్వస్వాతంత్రముగా సర్వదా సంచరించే బుద్ధి సంశయిస్తోంది.

రాజు : ఏమీ?

మం : తమ ఆజ్ఞ కొనసాగదేమో నని నా బుద్ధి సంశయిస్తోంది మహారాజా!

రాజు : ఎప్పుడూ సరళముగా ప్రవర్తించే తమబుద్ధి కిప్పుడు విపరీత వృత్తి ఏల కలిగెనో?

మం : స్వామిపూజాదురంధరత్వమున మొలగే బుద్ధి కెప్పుడు సరళవృత్తే మహారాజా! విపరీతత్వము మనవల కల్పించుకొన్నది.

రాజు : కాంచీపురాధినేతను గెల్చిన నేను తత్కాంచీ కుమారిని శిక్షించలేనా?

మం : మహారాజులు శిక్షించుటకూ, రక్షించుటకూ సమర్థులే. కాని కాంచీకుమారిపై తమరు వేయించిన శిక్ష పొరపాటేమోనని సందేహము.

రాజు : అందు కాటంకము కలుగజేసే ప్రబలశత్రు వెవ్వడైనా ఉన్నాడా?

మం : మానవరూపముతో లేదు.

రాజు : సమార్జకుల కీరాజ్యములో లోటువచ్చిందా?

మం : మాటమాత్రమున వేలకొలది తమ ఆజ్ఞ శిరసావహిస్తారు.

రాజు : ఇక వివాహము చేయించడముకు పురోహితులు కరవా?

మం : అట్టికర వీరాజ్యమున లేదు మహారాజా!

రాజు : అయితే కాంచీకుమారిని సమార్జకున కిచ్చి వివాహము చేయించండి.

మం : మహారాజా! ఒక్క మనవి.

రాజు : ఏ మది?

మం : తమరు పగ సాధించదలచుకొంట– కాంచీపురాధీశుని మీద.

రాజు : అవును.

మం : ఆవిధముగా పగ సాధించారుకూడాను.

రాజు : అవును.

మం : కాంచీకుమారిని తాము తలచి వివాహమాడ తలపెట్టారు.

రాజు : ఆమాట నిజమే.

మం : కాంచీపురరాజు ఆ మాట విని చులకనగా మాట్లాడాడు.

రాజు : అవును.

మం : నే నుచ్చరించుటకు సహితము జంకే, అనరాని మాట అన్నాడు.

రాజు : అతనిమాటే అతనికి అప్పజెప్పవలెను గదా! అందుకనే మేము వేయించిన ఆజ్ఞ— సమ్మార్జకున కిచ్చి ఆమెను పెండ్లిచేయవలె నని—

మం : మదోన్మత్తులకు ఉచితానుచితజ్ఞత ఉండదు గదా!

రాజు : అందుకనే ఆతని గర్వ మణచుటకు యుద్ధములో ఓడించితిని.

మం : ఆ తప్పు కాశిక్ష సరిపోలేదా మహారాజా!

రాజు : చాలదు.

మం : ఆతని కుమార్తెను, కాంచీకుమారిని, సమ్మార్జకున కిచ్చి పెళ్ళిచేయడము— ఎవరికి శిక్షగా మీరు భావిస్తారు?

రాజు : రాజుకు శిక్ష కాదా!

మం : అంతకన్న కాంచీకుమారికి కాదా స్వామీ!

రాజు : నల్లుల మంచమునకు కర్రదెబ్బలు తప్పవుగదా!

మం : నేర మొకచోటా, దండన వేరొకచోటానా న్యాయమూర్తీ?

రాజు : ధర్మసూక్ష్మ మెరిగిన మంత్రి పుంగవులకు నేను వేరే చెప్పవలసిన పనియేమి ?

మం : స్వామివారి ఆజ్ఞఅయితే ఈ సేవకు డొక మనవి— ధర్మసూక్ష్మము—చెప్పబో బోతున్నాడు.

రాజు : కానియ్యండి.

మం : తాము విధించిన శిక్ష తప్పుచేసిన కాంచీపురాధీశు డనుభవింప దగినదే.

రాజు : అవును.

మం : తప్పుచెయ్యని కాంచీకుమారి ఆ జన్మమూ ఆ శిక్ష అనుభవింపవలసి ఉంటుంది.

రాజు : విచారించ వలసిన విషయమే కాని—అది తప్పని సరి.

మం : అంతకన్న విచార కరమైన సంగతి మనవి చేసుకో బోతున్నాను.

రాజు : ఏ మది ?

మం : శిక్షను విధించే తామే ఆ శిక్షకు భాగస్వాములు కా బోతున్నారు.

రాజు : నాకు నేను శిక్ష విధించు కుంటున్నా ననా మీా అభిప్రాయం?

మం : చిత్తం.

రాజు : అ దెట్లు ?

మం : వివరముగా మనవి చేసుకుంటాను. సావధానముగా ఆలించవలెను ప్రభువులు.

రాజు : సావధానులమే.

మం : తాము కాంచీకుమారిని ప్రేమించి వివాహమాడ నిశ్చయించారు

రాజు : అవును.

మం : కాంచీ కుమారి తమ్ము ప్రేమించి వివాహమాడ నుబలాట పడ్డది.

రాజు : కావచ్చు.

మం : శుద్ధ సంకల్పుల సంకల్పలకు విపరీత ఫలములుండవు గాదా!

రాజు : ఆమాట యిప్పు డెందుకు ?

మం : తమరు తలపెట్టిన వివాహ సంకల్పమున కిట్టి విపరీత ఫలము రానున్నదని నేను ఆశ్చర్య పడుతున్నాను.

రాజు : ఏమి చేయగలను ?

మం : ఆమెపై లగ్నమైయున్న మీహృదయమును మీరు చంపుకోవడమే కాకుండా మీపై లగ్నమైయున్న ఆమె హృదయమునుకూడా మీరు చంపడములేదా?

రాజు : ఏమి చేయగలను ?

మం : ఎక్కడ తాండవమాడునని ఊహించారామె పాద ములు—మీ రామెను మోహించి నప్పుడు—... ఈ రాజసౌధములోనా—పాడు పూరిగుడిసెలోనా ? ఎవరి యాశల నూరించు నని ఊహించా రామె చూపులు—మీఆశలా, ప్రాకృత జనులవా ? ఎవ రిని ఎల్లవేళలా ముంచెత్తునని ఊహించా రామె

లావణ్యము—మిమ్మూ, మీ సేవకునా ? ఎట్టి శుద్ధ సంకల్పము మీది ? దానికెట్టి విపరీత ఫలము వచ్చె కొంటారా మహారాజా !
తొలినాటి మీ సుసంకల్పములను చంపుకొన్న పాపము మిమ్ము చుట్టుకోదా ?
ఆమె హృదయ సంకల్పముల కురిబోసే శిక్షవిధించిన పాపము మిమ్ము చుట్టుకోదా ?
ఫలోన్ముఖము కాని మీ సంకల్పము వల్ల పుట్టే దుఃఖము—నిరంతర చింతనవల్ల కలిగే దుఃఖము—ఆజన్మ దుఃఖము మీరనుభవించ బోవడము లేదా ?
ఎవరికీ శిక్ష ?—ఆమె ఒక్కతె కేనా ?
ఎవరు వేశారీశిక్ష—మీరా ?
కాదు మహారాజా కాదు. ఈ శిక్ష మీకు. అందరి కన్న అధికముగా మీరనుభవించ వలసిన శిక్ష ! ఈ శిక్ష మీరు వేసిన శిక్షకాదు. కాంచీ పురాధీశుడే మీపై వేసినాడీ శిక్ష. ఇంత కఠినశిక్ష యితరులు మీపై విధించగలరా ప్రభూ !
మీరు గెలవ లేదు, రాజా, కాంచీ పురాధీశ్వరున్ని; అతడే గెలిచాడు మిమ్ము.

రాజు : ఏమిటి ?

రాజు : వేటకాని బాణమునకు లక్ష్యమైన హరిణము వేటకానితో వాదమునకు దిగుతున్నదా ?

కాంచీకుమారి : మీరు ప్రేమించి పెంచుకో దలచుకొన్న మృగమునే తీవ్రబాణముల కాహుతి చేసే కఠినహృదయులు కారని ఈ దీనురాలి ఆశ.

రాజు : కఠినహృదయము రాజలక్షణములలో నొక్కటికాదా శత్రుకుమారీ!

కాంచీ: అబలపట్ల కాదు, దయామయా!

రాజు : పురుషులతో—నీతండ్రికి శత్రువైనవానితో వాదించే సాహసము నీ కెక్కడినుండి వచ్చింది—అబలా!

కాంచీ: తమ సన్నిధానమున అవనతముఖినై నిల్చోవలసిన లజ్జావతిని నేను, మీకు నా కష్టసుఖములు నచ్చజెప్పే స్థితికి వచ్చానని క్రుంగిపోతున్నాను, రాజా!

రాజు : కారణము?

కాంచీ: తమరే!

రాజు : నీ తండ్రికాడో?

కాంచీ: బ్రహ్మవ్రాతకు మించిన మహోత్కృష్ట దశ నా తండ్రి నాకంటగట్ట దలిచాడు. అది నాతండ్రినేరము కాదు. అతనికి నాపైగల వాత్సల్యము చేసిన నేరము.

రాజు : నేను సమ్మార్జకుడ నటగా! నీకు నేను తగనటగా! అందువల్లనే నీవు సమ్మార్జకునకే తగుదువని నీతండ్రికి నేను ఋజువు చేయదలిచాను.

కాంచీ: నాతండ్రి దృష్టిలో మీ రెట్టివారైనా నా దృష్టిలో మీరు దైవసములు.

రాజు : ధన్యుడనే!

కాంచీ: నాకు మీరు తగుదురో లేదో నిర్ణయించేది నా హృదయము— మా తండ్రి వాత్సల్యము కాదు.

రాజు : ధన్యుడనే!

కాంచీ: నేను సమ్మార్జకునకే తగుదునని నాతండ్రికి ఋజువు చేయ దలిచారా?

ఆపక్షమున మీరు సమ్మార్జకులే కావలె; మీకు నేను జాయను కావలె.

రాజు : ఏమీ?

కాంచీ: అట్లుకాని పక్షమున— ముఖముపై కోపించి కళ్ళ నూడబెరుకుకొనే అపవేకులు మీ రవుతారని నేనెన్న టికీ నమ్మను.

రాజు : ఇం దవివేక మెక్కడ నున్నది?

కాంచీ: నన్ను ప్రేమించి నా హృదయమును తమ జీవిత ములో లంగరు వెయ్యదలచిన తమరు మీఅమూల్య ప్రేమ నేమి చేసుకొంటున్నారు? ఆత్మహత్య దోష మని కాదా పెద్దలమాట! దేహమును చంపుకోవడం కన్న ప్రేమను చంపుకోవడము ఎక్కువ దోషము కాదా?

రాజు : నా హృదయంలో అంకురించే ప్రేమబీజాలను నేను పోషించడం మానేశాను. అందు దోషము లేదు.

కాంచీ: ఆ బీజములు హృదయ క్షేత్రములో మొట్టమొదల ఎందుకు చల్లుకొన్నారో ?

తమ ప్రేమవారాశిలో ఈదులాడవలసిన నా హృదయం తమ కోపపర్వతానికి తగుల్కొని ముక్కలైపోతుంటే చూస్తూ ఊరుకొంటారా రాజా !

రాజు : ఎవరి అదృష్టము వారిది.

కాంచీ: నన్నేల మీరు ప్రేమించవలెను మొదట ? నా మనస్సులో ఆశ లేల రేకెత్తించవలెను మీరు? ప్రేమ నేల ప్రజ్వలింపజేయవలెను ? చిన్నవువ్వుల నవ్వులతో నవ్వే నా హృదయాన్ని మీ రాకర్షించి మీపై లగ్నము చేసుకోవడ మేల? లోకము జాడలు గుర్తెరుగని పసిదానను నన్ను నా అమాయకపు లోకమునుండి బయటకిలాగి ఈ తుపానులోనికి ఎందుకు దింపారు ?

ఇది మీ వివేకలక్షణమా ? నా దురదృష్ట ఫలమా ? అబలల హృదయములు వజ్రసన్నిభములనా తమ ఊహ ?

ఈ నా భగ్నహృదయము - తొలిసారి మీకర్పించిన లేతహృదయము——ఇతరుల వశము చేస్తానా, జీవితేశ్వరా ! అట్లాచేస్తే ఈ ఘటము నిలుస్తుందా ?

రాజు : నా మాట కెప్పుడును తిరుగు లేదే మరి?

కాంచీ: సత్యసంధుల వాక్కులు వృథా కావు జగదీశ్వరా. మీ వాక్యములు వృథా కావు.

కామాక్షీవరపుత్రిక, అమాయిక లేత కోర్కెలు వృథాపోతవా ?
నా కోర్కెలు వృథాపోతవా ?
నేను సమ్మార్జకుని భార్యనే కావలెను. మీ పాద సేవకే నాజీవితమంతా వినియోగపడి తీరవలెను.

రాజు : మంత్రీశ్వరా !

మం : చిత్తం మహారాజా !

రాజు : నేను సమ్మార్జకుణ్ణే, మంత్రీ !

మం : అదెట్లు రాజా ?

రాజు: నా ఖడ్గముతో నలుముఖములా శత్రుసేనలను తుడిచి వేస్తినిగదా!

మం : ఖడ్గము సమ్మార్జనికాదు రాజా !

రాజు: నా అనునయవాక్యములతో, ప్రేమతో, కాంచీ కుమారి దుఃఖమును తుడిచివేస్తున్నాను మంత్రీ !

మం : అనునయ వాక్యము సమ్మార్జని అవుతుందా రాజా ! ప్రేమా కాదుగదా !

రాజు: అయితే నేను సమ్మార్జకుణ్ణి కానంటారా !

మం : కారనే నా ఊహ మహారాజా !

రాజు: మరి ఏమిటి ఉపాయం ?

మం : సమ్మార్జని పట్టినవాడే సమ్మార్జకుడు. మీరు కోపముతో ఆ పదము వాడినప్పుడు మీకు హృద్గతమై ఉన్న అర్థమదేకదా ! ఇక ఉపాయము మాటకా_

మాతృశ్రీ కాంచీకుమారినే అడగండి—ఆమె వివేక
వతి.

రాజు: ఏమంటావు దేవీ !

కాంచీ: కామాక్షీ పదభక్తుడు నాతండ్రి మిమ్ము సమ్మార్జకు
డన్నాడు. ఆయనమాట చెల్లవద్దా ? మీరు సమ్మా
ర్జకులైతే మీభార్యను నేనూ సమ్మార్జని పట్టవలెను.

రాజు: వివేకవతివే.

కాంచీ: కాబట్టి, జీవితేశ్వరా

స్వర్ణదండమండితమౌ
సమ్మార్జని నేబట్టెద
స్వర్ణదండమండితమౌ
సమ్మార్జని మీరున్నూ
పట్టుడు, మన మిరువురమును
ప్రాణేశ్వర ! కామాక్షీ
సన్నిధాన వర్తుల మయి
శాంకరి వశవర్తుల మయి
కామాక్షీ దృఙ్మాలలు
కప్ప మనల నొకటిజేసి
కామాక్షీ ప్రాసాదము
కల ధూతముభాతి వెలుగ
కలసి చిమ్ముదా మండీ.

కామాక్షీ యిరువురమును
మానసములనుండి కోప
మంతరింపజేయవమ్మ
మానసములలోని ఈర్ష్య
మటుమాయము చేయవమ్మ
నీసదనమె మాయెడదలు
నిర్మలమ్ము జేసుకొమ్మ,
కరకంకణ నిక్వాణములు
కల్యాణపు పాటలుగా
ధరణీశ్వరు కఠినభుజా
దండము జయ స్తంభముగా
పాణిగ్రహణోత్సవవై
భవము లిట్లు చెలగ తల్లి
నాలుగుచేతులు కలుపుచు
సమ్రాజ్ఞకు లిద్దరమును
ఒకటేహృదయముతో డుత
కలయ చిమ్ముచుంటిమమ్మ
కామాక్షీ నీ సదనము
కరుణజూడవమ్మ తల్లి
కామాక్షీ, కామాక్షీ!

[ప్రతిభలో పడ్డ శ్రీ శివశంకరశాస్త్రిగారు. వ్రాసిన ప్రథువాక్యమనేగీతికలోని కథయే ఈ నాటికలోని కథ]

# దసరా దిబ్బ

రాజు : పరివ్రాజకులకు సాష్టాంగ నమస్కారములు. కవులకు వందనములు.

కవి : ప్రభువుల వారికి నిత్యానందము కలుగు గాక.

సన్యాసి: శిష్యులకు నారాయణ పాదభజన సామ్రాజ్యము కూడా కలుగునుగాక!

రాజు : కవులకు భవిష్యత్తు కాచఫలకము వలెనే సుస్పష్ట మటగా ?

సన్యా: భవిష్యత్తు అనంతము. కవులకు స్పష్టమయ్యే భవిష్యత్తు లిప్తామాత్రము.

రాజు : జ్యోతిష్కులకో !

సన్యా: వారి బ్రతుకువలెనే దృశ్యాదృశ్యము.

రాజు : వారిద్దరికే సామ్యభేదము లెట్లు ?

సన్యా: కవి వాక్యములకు నిత్య సత్యస్థితి ఉన్నది కాలజ్ఞుని వచనము తాత్కాలిక సత్య నిర్దేశ మాత్రము.

రాజు : సన్యాసి వచనమో ?

కవి : శిలాశాసనము. కాదు. శ్రీమన్నారాయణుని శాసనము.

రాజు : కవివరా ! లోకానందము కోసము మేము చేసిన ఈ కార్యమునకు ఎంతవరకు స్థిరత్వమున్నది ?

కవి : సృష్టి స్థితి లయములు లోకములకు వలెనే సామ్రాజ్యములకు కూడా సామాన్యమను ఈ ఆశ్రితుని మాటలు తమకు కోపకారణము కాకూడదు.

రాజు : సత్యముపై కోపించు దుర్బల చిత్తుడనా నేను ? పరిప్రాజకా, ఈ నా కార్యమును గురించి తమ అభిప్రాయము ?

సన్యా: ఈ మీ కార్యమునకు సుస్థిరత్వ మున్నది.

రాజు : మీ మీ వాక్యముల సత్యాసత్యముల నిర్ణయించు సామర్థ్యము అమర కోటికే ఉన్నది.

సన్యా: స్వకార్య స్థిరత్వ విచారణ ఈ దేహ మున్నంత వరకే.

కవి : ఉపాధి భేదించిన ఆ కోరిక నశించునని.

రాజు : అట్టి నమ్మకము కలుగుటకు కూడా ఈ దేహమే కాబోలు నా కడ్డుపడుతున్నది. పోనీ కాని—ఈ కార్యమును గురించి ప్రజ లేమను కొనుచున్నారు ?

కవి : సంతోషమును ప్రజలకు గోరుముద్దలుపెట్టి తినిపించుచున్నారు సార్వభౌములని.

సన్యా: స్వర్గ సుఖములను చవిచూపుచున్నారు సార్వభౌములని.

రాజు : ప్రజల వాక్యములలో సత్యమెంతవరకు ?

కవి : ప్రజలకు ప్రభువులే తండ్రులు.

సన్యా: ప్రజలకు ప్రభువులే దేవుళ్ళు.

రాజు : ప్రజల ఇహాపరములు పాలకుల హస్తగతము లటగా ?

సన్యా: అది గుర్తించనివారి విషయముననే 'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మను వచనము.

రాజు : నేను గుర్తించితినా లేదా అని భయము.

సన్యా: అందుకు మీ కార్యమే సాక్షి.

కవి : చిత్రకళాదేవికి నిత్యనివాసమైన కృతకాద్రివలె నున్న ఆ శిలా మంటపమే సాక్షి.

సన్యా: దానిని తామర మొగ్గవలె తేల్చివేయుచున్న అధ్యాత్మ కీర్తన కల్లోలినీ తరంగములే సాక్షి.

కవి : అనంతమైన ఆ ప్రజా సమూహము యొక్క దుఃఖమంతా ఆకాశ నైల్యమున మాయమైనది. అనంతమైన ఆ ప్రజా సమూహముయొక్క హాసముల వల్ల ఆ శిలామంటపము పాలసముద్రములో లక్ష్మియైనది.

సన్యా: ఆ ప్రజల పాటలలో శ్రీకృష్ణుని వేణువున్నది. ఆ ప్రజల ఆటలలో శివుని తాండవమున్నది. ఆ ప్రజల హృదయములలో సృష్టి కర్తకు కమలాసనమున్నది.

రాజు : ఈ సామ్రాజ్యమును స్థాపించి పోషించునది సన్యాసులూ, కవులూ. ఇప్పుడు నాకు మార్గదర్శకులు కూడా వారే. అయితే ఈ మంటపమునకు నామకరణము చేస్తిరా తాము ?

సన్యా: పునాది వేసినప్పుడే నామకరణము చేసినవి ప్రజల హృదయములు.

రాజు : ఏమని ?

కవి : మహార్ణవమి మంటపమని.

౨

కవి : స్వామీ నమస్కారము.

సన్యా: కవీ, ఏమి పనిమీద వచ్చావు ?

కవి : సందేహము తీర్చుకోవాలని.

సన్యా: కాలము సందేహాలు తీర్చుతుంది కదా.

కవి : కాలము నంటి వుండడమునకు శక్తి చాలదుగదా మానవులకు.

సన్యా: అవును ఏమది ?

కవి : కవుల వాక్యములకు నిత్యసత్య స్థితి వున్న దన్నారు తాము.

సన్యా: అవును.

కవి : రాజుగారి కార్యములకు లయస్థితి నేను చెప్పాను.

సన్యా: అవును.

కవి : తామా కార్యముకే సుస్థిరత్వము సెలవిచ్చారు.

సన్యా: అవును.

కవి : ఈ వాక్యములు సమన్వయము చేసుకో లేకుండ వున్నాను స్వామీ.

సన్యా: రాజు కార్యములో ప్రజాహితము ఇమిడి ఉన్నది.

కవి : అవును స్వామీ.

సన్యా: ఆ ప్రజాహితములో ఐహికాముష్మికములు ఇమిడి ఉన్నవి.

కవి : అనువు స్వామీ.

సన్యా: ఐహికమునకు లయస్థితి ఉన్నది కాబట్టి నీ వాక్యము లకు సత్యస్థితి వచ్చింది.

కవి : చిత్తము.

సన్యా: ఆముష్మికమునకు సుస్థిరత్వము-నే చెప్పిన మాట.

కవి : చిత్తము.

సన్యా: ఆమాట నిరూపించడ మెట్లని మళ్ళీ నీ సందేహము.

కవి : అవును స్వామీ.

సన్యా: కాలపుగట్టున నిలబడి నిశ్చలమనస్సుతో చూస్తే ఏమి కనిపిస్తుంది?

కవి : అల్లకల్లోలముగావున్న కాలసముద్రము.

సన్యా: ఆ సముద్రములో మనుష్యుడు తన శక్తితో సృజించిన కట్టడములన్నీ నశించుచున్నవి.

కవి : చిత్తము.

సన్యా: మనుష్యుడు తన మేలుకోసమే చేసుకొన్న కార్యము లన్నీ నశిస్తున్నవి.

కవి : చిత్తము.

సన్యా: సామ్రాజ్యములు మునిగిపోతున్నవి. ఎడారులలో పట్టణములు లేస్తున్నవి. సముద్రములు కొండలగు చున్నవి.

కవి : చిత్తము.

సన్యా: ఈ కల్లోలములో నశించనిది ఏమైనా ఉన్నదా?

కవి : ఉన్నదానికే శాశ్వతత్వము.

సన్యా: పరమాత్మనుద్దేశించిన కార్యములు మాత్రమే కాల సముద్రములో తేలియాడుతూ, పైకెగసి సూర్యునితో కలసి అతని కాంతిని వృద్ధిచేస్తున్నవి.

కవి : మన రాజుగారి కార్యము ఏమి అవుతోంది ?

సన్యా: ఆకార్యబీజముకు నిత్యత్వము వచ్చింది.

కవి : బాహ్యరూపమున్నదా ?

సన్యా: బాహ్యరూపము కాలసముద్రములో కరిగిపోయింది.

కవి : మరి ఈ కార్యముకు సృష్టి స్థితి లయములు ఉన్నట్లే కదా.

సన్యా: కార్యబీజము నశించలేదంటినిగా. అందుచేతనే సుస్థిరత్వమున్న దన్నది.

కవి : తమ మాటలు అర్థముచేసుకొంటాను. సెలవు.

సన్యా: ఆలోచన, అనుభవము మననము నిగూఢ సత్యమును బయల్పరచగలవు.

కవి : చిత్తము.

3

కవి : చంద్రుడా, పూర్వమిక్కడ పట్టణమున్నట్లు జ్ఞాపకము. ఇప్పుడేమైనది ?

చంద్రుడు: నన్నెందుకు అడుగుతావు ?

కవి : నీవు ఆదినుండీ సృష్టిని చూస్తున్నావు కాబట్టినీ, ఆ మార్పులు కనిపెట్టుతూ ఉన్నావు కాబట్టినీ.

చం : నీకు ఆ మార్పులు అసామాన్యము కాబోలు; నాకు సామాన్యమే.

కవి : నిత్యపరిచయమువల్ల సామాన్యత్వము పదార్థములకు పట్టినా వాటి విలువకు లోటు ఉండదుకదా!

చం : ఆ విలువలు కట్టదగ్గవారుంటే నీవు చెప్పినమాట వాస్తవమే.

కవి : అందుకనే నేనడుగుతున్నాను.

చం : నీవు ఎవరవు ?

కవి : నేను కవిని.

చం : సత్యత్వము వెల్లడిచేసేవాడవనా నీ అభిప్రాయము ?

కవి : కావచ్చు. నీ కళ్ళముందర సామ్రాజ్యాలు వైభవముతో వెలిగినవి. నీ కళ్ళముందరే అవి నశించినవి. నీకు వాటి చరిత్ర గుర్తేగదా.

చం : సామ్రాజ్య డోలికలమీదా, సామ్రాజ్య సమాధుల మీదా నా దృష్టి ఒక్కమాదిరిగానే పడుతుంది.

కవి : అందుకనే నే వేసే ప్రశ్న.

చం : భూమిని అడగలేకపోయావు ? సామ్రాజ్యభారాలు వహించేదీ, బరువు దింపుకొనేదీ అదేకదా ?

కవి : భారమనే దృష్టి దానికి ఉంటుంది కాబట్టే దానిని అడగ లేదు.

చం : నీవు చెప్పినట్లు ఇక్కడ పట్టణమున్నమాట వాస్తవమే.

కవి : అదేమయినట్లు ?

చం : అప్పుడు మనుష్యుల పట్టణము, ఇప్పుడు మృగముల పట్టణము.

కవి : అసలు ?

చం : అసలు మృగముల పట్టణము. తరువాత మనుష్యుల దైనది. ఇప్పుడు మృగములు తమ హక్కు తిరిగి పొందినవి.

కవి : మనుష్యుల పట్టణమును గురించే నే వినదలచు కొన్నాను.

చం : వారి ఇచ్ఛకు ఎంత ఔన్నత్యమున్నదో వారి వైభ భమునకుకూడా అంత ఉన్నతి వచ్చినది.

కవి : ఆనాటివారి వైభవమునకు ఆనాటి మనుష్యులకోరిక కొలతబద్ద అన్నమాట.

చం : ఆనాడైనా యీనాడైనా అంతే.

కవి : వారి కోరికలో ఇమిడినవారి వైభవ మెటువంటిదో ?

చం : రత్నభవనములు, చిత్రశాలలు, జంతువాహనములు, నృత్యసమృద్ధి. గానకళావికాసము, కవిత్వవైభవము, చీని చీనాంబరములు, చవులూరు తిళ్ళు, సుగంధ ములు ... ...

కవి : వట్టి గుణవాచకములవల్ల సమిష్టి వైభవము సన్న గిల్లుతున్నది.

చం : వీటికితోడు వీటిని అనుభవించుటకు నిర్భయత్వమూ, దుఃఖలేశత్వమూ కలుపుకో.

కవి : అంతేనా ?

చం : అంతేకాదు. ప్రజాబాహుళ్యముమీద నిర్దిష్ట కాల ములో నిర్దిష్టదేశముమీద వాటిని వ్యాపింపచెయ్యి.

కవి : అది వారి వైభవమా ?

చం : నాశనము గుణముగా గలవారి వైభవము.

కవి : శాశ్వతత్వచిహ్నమేమీ లేదా ?

చం : ఈ పాడుపడ్డ పట్టణమునంతా వెదికితివికదా నీకేమీ గోచరించలేదా ?

కవి : అవి రాతి కాలువలు, ఇవి గజశాలలు, అవి అంతః పురములు ఇవి కేళీసరస్సులు.......

చం : వీటిశైథిల్యములో శాశ్వతత్వ చిహ్నమున్నదా ?

కవి : లేదేమో !

చం : కారణము ?

కవి : తాత్కాలిక సుఖ సంపాదకత్వము వాటి గుణమనుకుంటాను.

చం : సరి.

కవి : అవి దేవాలయములు... ... ...

చం : వాటి సంగతి ఏమిటి ?

కవి : అక్కడచేరిన భక్తుల నిత్య ప్రార్థనలే పరమునకు బాటలైనవి.

చం : ఆ బాటలకు లేదా శాశ్వతత్వము ?

కవి : ఉండదామరి !

చం : ఆ కట్టడము చూశావా ?

కవి : ఆ, దాని పేరేమిటి ?

చం : అది ఒక రాజు హృదయ కమలమునుండి బయలు వెడలిన సౌరభము.

కవి : ఎందువల్ల ?

చం : భక్తుని ప్రార్థనా, కవి గీతమూ, గాయకుని గానమూ; నటుని నృత్యమూ ఆ రూపము పొందినవి.

కవి : అదీ శిథిలమైనదే.

చం : ఆ రాతికట్టడము శిథిలమైనది.
నీకు గోచరముకాని పరమునకు పోయే పూలబాటలు శిథిలము కాలేదు.

కవి : ఎట్లు ?

చం : అప్పుడు మనుష్య సముద్రము ఉప్పొంగి అలలుగా వచ్చి దానిని తాకినది.

కవి : నృత్యగీతాదులు ప్రార్థనారూపముగా ఆ తావునుండి పై కెగసినవా ?

చం : అవును. నేడు నాచలవలో మనుష్యేతర లోకము ఆ తావుననే సుఖమును పొందుచున్నది.

కవి : అరణ్యాక్రాంత మైనదని దుఃఖించుట విశాలసృష్టి కాదన్నమాట.

చం : ఆతావుననే తరుచుగాగంధర్వులు విలాసముగా నేడు సంచరిస్తూ ఉంటారు.

కవి : ఊఁ.

చం : ఆ తావు ఖేచరులకు విడిది.

కవి : ఊఁ.

చం : వ్యోమయానము చేయు విద్యాధరుల విమానములకు ఆతావు విశ్రమస్థానము.

కవి : నీకు ఈ విషయములన్నీ అనుభవసిద్ధములు కాబోలు. నాకు ఊహామాత్ర దృష్టములు.

చం : దేవలోకమునుండి నాగలోకమునకు విహారము సల్పు నాగకన్యలకు ఆ తావు మజిలీ.

కవి : ఊం.

చం : దేవతా వాహనములన్నింటికి ఆ తావు లీలోద్యానము.

కవి : ఈనాటి వైభవమేనా యిది.

చం : ఈ వైభవమును చూడలేక మీరు కళ్ళ నీరు పెడుతున్నారు.

కవి : చూచు శక్తి లేదుకదా మరి!

చం : మీబుద్ధి కతీతమైన కార్యములు జరుగవచ్చునని నమ్మకమున్న చాలును.

కవి : దాని పేరడిగినాను, చెప్పినావుకావు.

చం : మనుష్యేతరలోకము పెట్టిన పేరా?

కవి : అది నాకెందుకు? మానవులు పెట్టినపేరు.

చం : మానవులు పెట్టిన పేర్లు నానాటికీ మార్పుచెంది పోయినవి.

కవి : నేడు మిగిలినపేరు?

చం : నేటి మానవులు పెట్టిన పేరున్నది.

కవి : అదే నాకు కావలసినది.

చం : ఈ స్థలము పాడు పట్టణము.

కవి : ఆ తావు?

చం : దసరా దిబ్బ.

కవి : మహార్నవమి మండపమా!

# వ రూ ధి ని

ప్రవరుడు: ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్.

శిష్యులు: ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.

ప్రవ : ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే.

శిష్యు: (రెండుమార్లు వల్లెచెబుతారు)

ప్రవ : ఆనన్దేన జాతాని జీవన్తి.

శిష్యు: (రెండుమార్లు చెబుతారు)

ప్రవ : ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి.

అన్నపూర్ణ: ఏమండోయ్, విన్నారో లేదోకాని నిన్న సాయంత్రం మంచినీళ్ళకని ఏటికి వెళ్ళామండీ, నేనూ తిమ్మక్కా, లక్కమ్మాను. బిందెలు తోముకొని నీళ్ళుముంచుకొని బిందెలు బుజానికెత్తుకుంటూంటే లక్కమ్మ అందికదా, చూడొసే చూడు, ఆకాశం మీద ఏమిటే ఆ ఎగిరేది అంది. అటుచూతుముగదా అది పక్షికాదండీ; జంతువూకాదండీ. జంతువు లెగురుతాయా అసలు.

ప్రవ : జంతువులు ఎగరడం వినలేదు. ఋషిపక్షులు ఎగురుతాయి.

అన్న: ఋషిపక్షులు నాకు తెలియదండీ. అది ఋషిపక్షి కాదు. నిదానించి చూతునుగదా, మనిషిగానే ఎగురుతున్నాడా అనిపించింది.

ప్రవ. మనిషి ఎగరడం ఏమిటే అజ్ఞానం. ఏ రాబందునో చూచి అల్లా అనుకున్నారు కాబోలు.

అన్న: అదేమిటండీ అలా అంటారు. రాబందునే ఎరగమా ఏమిటి? ఎంత ఆడవాళ్ళమైనా.

ప్రవ: అయితే ఏమిటంటావు?

అన్న: సిద్ధులూ, గంధర్వులూ ఎగురుతారటగా, ఎవరైనా మన దేశం ఎగురుతూ వచ్చేరేమోనండీ?

ప్రవ: సిద్ధాదులు ఆకాశ గమనం చేస్తారని విన్నాను. వాళ్ళు మనుష్య లోకానికి రారే.

అన్న: ఏమో వస్తారో రారో మేముచూడటం మాత్రం చూచాం. ఒక పురుషుడు ఉత్తరాన్నుంచి ఆకాశం మీద ఎగురుతూవచ్చి మన ఊరి మీదుగా వెళ్ళి నట్లుంది. ఇలాంటి విడ్డూరాలు పుడుతున్నాయేమండీ ఈకాలంలో.

ప్రవ: మన ఊళ్ళోగానే దిగలేదుగదా...

అన్న: ఏమో చెట్లు అడ్డురావడంవల్ల కనిపించలేదు.

ప్రవ: గంధర్వుడు మనుష్యలోకానికీ, మానవుడు గంధర్వ లోకానికీ ప్రయాణాలు చెయ్యడం విడ్డూరమే అయినా తెలుస్తుందిగా.

అన్న: మానవుడు గంధర్వలోకానికంటున్నారు. మీకుగానే వెళ్ళాలని ఉందాయేమిటి? నన్ను వదిలిపెట్టిగానీ వెళ్ళకండిసుమా! నాకేమో భయంగానే ఉంది.

ప్రవ : అయితే ఆ మనిషి ఏవిధంగా ఉన్నాడో కని పెట్టారా ?

అన్న: లీలగా కనిపించాడండీ, కాషాయ వస్త్రాలు కట్టు కొన్నట్టుంది. శరీరంనిండా విభూతి పూసుకొన్న ట్లుంది. తలమీద పచ్చని కిరీటంగూడా పెట్టుకున్న ట్లుందండీ.

ప్రవ : గంధర్వులు విమానంమీద విహరిస్తారుగాని, ఎగరరే. వారికి రెక్కలుండవే...

అన్న: ఇతగాడికి రెక్కలు లేవండి. విమానమూ లేదు.

(వీధిలోనుంచి సిద్ధుని కేక)

సిద్ధుడు: హరహర మహాదేవ శంభో...

అన్న: ఎవరో మునీశ్వరుడు వచ్చినట్లుంది.

ప్రవ : అవును వారిని తీసుకువచ్చి సత్కరించాలి.

అన్న: నేనూ పొయ్యిలో నిప్పు వేసుకోవాలి. అదేదో చూడండి.

ప్రవ : చూడ్డానికే చూడు. ఇతడు కాషాయవస్త్రాలు కట్టు కొన్నాడు. వంటినిండా విభూతి పూసుకొన్నాడు. పులితోలుతో చేసిన టోపీ జడలమీద కప్పు కొన్నాడు. మీరు చూచిన వాడితడేమో...?

అన్న: అదుగో ఆయన మనయింటికే వస్తున్నారు. అవునండీ ఈయనేకాబోలండీ ఎగురుతూ వచ్చారు. మీరు వెళ్ళి ప్రత్యుద్థానం చెయ్యండి.

ప్రవ : ఇదిగో వెడుతున్నా. ఇతడు గంధర్వుడు కాడు— సిద్ధునివలె ఉన్నాడు.

సిద్ధు : (శంఖమూది) హరహర మహాదేవ శంభో ప్రవర సోమయాజులవారి ఇల్లేనా ఇది.

ప్రవ : చిత్తం చిత్తం! దయచెయ్యండి. నన్నే ప్రవర సోమయాజి అంటారు. తమరాకవల్ల నాగృహము పావనమైనది స్వామీ. తాము ఈ ఊరు ఎప్పుడు దయచేశారు ?

సిద్ధు : ఆకాశమార్గమున నిన్న సాయంకాల మిక్కడికి వచ్చాను. ఈ ఊళ్ళో శ్రోత్రియ ప్రవరులు ప్రవర సోమయాజులని విని మీ దర్శనార్థము వచ్చాను.

ప్రవ : నేను ధన్యుణ్ని. తమవంటివారు నాయింటికి ఎందుకు దయచేస్తారు ?

వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేషమెమ్మెయిన్
వానిది వంద్యజీవనము వానిది జన్మము వేరుసేయ కె
వ్వాని గృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నాన విధాన్న పానముల సంతసమందుచు బోవునిచ్చలున్...

సిద్ధు : మంచిది వత్సా. మావంటి తైర్థికులకు మీవంటి గృహస్థులు సుఖముగా నుండుటయే కావలసినది. లేకుంటే మేము తీర్థయాత్ర లెట్లా చెయ్యగలము ? గృహస్థాశ్రమమును మించిన ఆశ్రమ మున్నదా?

ప్రవ : చిత్తము స్వామీ. సంసారభారమువహించే మాబోటి గృహస్థులకు సుఖలేశము మీబోటి మహాత్ముల

దర్శనము వల్లనేకదా కలిగేది. అయితే స్వామీ
తీర్థయాత్రాపరులుగదా తాము—

ఏయే దేశములన్ వసించితిరి ? మీరేయేగిరుల్ చూచినా ?
ఏయే తీర్థములందు గ్రుంకిడితి ? ఏయే ద్వీపముల్
మెట్టినా ?
ఏయే పుణ్యవనాళి ద్రిమ్మరితి ఏయే తోయధుల్
దాసినా ?
రాయాచోటులగల్గు వింతలు మహాత్మా నాకెరింగింపరే.

స్వయముగా వెళ్ళి తీర్థయాత్రలు సేవింపలేకపోయినా
పుణ్యతీర్థమహిమ వినడంకూడా కల్మషహరమనికదా
పెద్దలు చెబుతారు.

సిద్ధు : మీరు సేవించలేకపోవడమెందుకు ? మీరున్నూ
సేవించవచ్చును. మోక్షదాయకములైన పట్టణము
లెనిమిదిన్నీ నేను సేవించాను. ఇంకా ద్వాదశజ్యోతి
ర్లింగములను దర్శించి ఆరాధన చేసుకున్నాను.

ప్రవ : ఓహో తామెంతటి పుణ్యపురుషులు స్వామీ! ఇంకా
ఏమేమి చూచారు ?

సిద్ధు : దర్శనము వల్లనే చిదంబరము ముక్తినిస్తుంది. జన
నమువల్ల కమలాలయము ముక్తి నిస్తుంది. వారణా
సిలో మరణము ముక్తిప్రదము. స్మరణమువల్లనే
అరుణాచలము ముక్తినిస్తుంది.

ప్రవ : ఈ తీర్థక్షేత్రములనుకూడా తాము సేవించారా
స్వామీ ?

సిద్ధు : ఆహా...

ప్రవ : ఈనాడు ఎంత పావన దినము. ఇంకా ఏయే వింతలు చూచారు స్వామీ...? బదరీనాథములో ఆరునెలలు మంచు; ఆమంచు బదరీ నారాయణుని ఆలయాన్ని కప్పివేస్తుంది. అయినా ఆలయంలోని అఖండజ్యోతి వెలుగుతూనే వుంటుంది. పంచసదములో జ్వాలా ముఖి దేవాలయంలో దేవతా ప్రతిమలుండవు, అగ్ని జ్వాలలే ఆలయంలో నిత్యమూ వెలుగుతూ ఉంటవి. భక్తులు నివేదనచేసిన క్షీరాదులను ఆ జ్వాలలే సగము గ్రహించి సగము ప్రసాదము క్రింద వదలిపెట్టుతవి.

ప్రవ : ఔరా, ఎంతటి ఆశ్చర్యము...నాకెన్నడైనా అట్టివి దర్శించు అదృష్టము పడుతుందా ?

సిద్ధు : ఎందుకు పట్టకూడదు ? ఇంకో వింత చెబుదునా ? కాశ్మీరంలోని అమరనాధ లింగము హిమలింగము. నేపాళములోని పశుపతినాథేశ్వర లింగము రస లింగము. ఇక కైలాస గిరిమీద పార్వతీ పరమేశ్వ రులు లీలా విహారములు నిత్యమూ జరుపుతూ ఉంటారు ? కైలాస గిరిచుట్టూ హిమము కప్పి ఉంటుంది. పాదరక్షలు లేకుండా కైలాసగిరి ప్రద క్షిణము భక్తులు చేస్తూంటారు.

ప్రవ : తాము చేశారా స్వామీ...

సిద్ధు : ఆహా చేశాను, కైలాసగిరి సమీపంలో నిత్యమూ ఓంకారము వినబడుతూ ఉంటుంది.

ప్రవ : ఎంతటి పుణ్య పురుషులైతేగాని అచ్చటి ప్రణవ నాదం వినగలుగుతారు! అయితే పార్వతీ పరమేశ్వరుల దర్శనం ఎవనకవుతుందా అచ్చట స్వామీ...

సిద్ధ : చర్మచక్షువు౦ కు కాదు. గంగామాయిపుట్టిన స్థలము గోముఖము. అచ్చటకూడా ఓంకారము నిత్యమూ వినబడుతూ ఉంటుంది. గంగోత్రిలో గాంగామాయిని పూజిస్తూ ఉంటారు.

ప్రవ : ఈనాడు ఈపుణ్య ప్రదేశాలు ఎట్లా చూడగలం స్వామీ...

సిద్ధ : గాఢ భక్తిగల ఈనాడు ఆ ప్రదేశాలు చూడడం దుర్ఘటమే. భావిలో అవి చూడడానికి అనుకూలాలు అధికముగా ఉంటవి. కాని అప్పుడు భక్తి క్షీణిస్తుంది.

ప్రవ : ఇంకా విశేషము లేమిటి స్వామీ?

సిద్ధ : ఉదయాస్తాచలములు చూచాను. మేరు మలయ నగ రములు చూచాను. నేను చూడని ప్రదేశమంటూ లేదు.

ప్రవ : సమస్తావకాశములను చూచారా స్వామీ! ఎంతటి దివ్యపురుషులో. మీరు మావంటి మానవులో లేక ఖేచరులో గంధర్వులో అనుకుంటున్నాను.

సిద్ధ : నేనూ మీవంటి మానవుణ్ణే...

ప్రవ : నాకో సందేహం బాధిస్తోంది స్వామీ! మానవ మాత్రుని కిట్టి యాత్రలు ఇంత కొద్దికాలంలో

సాధ్యమా ? మీరా, చూడబోతే చిన్నవయస్సులో ఉన్నట్లగపడుతున్నారు. రెక్కలు కట్టుకొని వెళ్ళి నప్పటికీ ఏండ్లూ పూండ్లూ పట్టునుకదా మీరెట్లా సాధించగలిగారీ కార్యము స్వామీ?

సిద్ధు : నిరంతర యోగసాధనంవల్ల అణిమాది సిద్ధులు లభిస్తవి. అంతేకాదు, మేము గురుకులవాసంచేసి గజకర్ణ గోకర్ణ విద్యలు, ఇంద్రజాల యక్షిణీ విద్యలూ గ్రహించాము. మాకు సాధ్యము కానిదేమిటి ?

ప్రవ : అయితే ఏ విద్యా సహాయముతో తీర్థయాత్రలు సాగించగలిగారు స్వామీ...

సిద్ధు : తీర్థయాత్రలు సాధించడానికి మేము సహాయముగా ఏవిద్యనూ గ్రహించలేదు. పరమ రహస్య విషయమైనా శ్రోత్రియులు గాన మీతో చెబుతాను. పరమేశ్వర సత్కృపవలన పాద లేపమనే మందు నాకు లభించింది. ఆమందు పాదములకు పూసుకుంటే సూర్యరథ సమానమైన వేగముతో, అలసట లేకుండా ఎంతదూరమైనా పోవచ్చును.

ప్రవ : పోవచ్చునా స్వామీ ?

సిద్ధు : ఆహా పోవచ్చును.

ప్రవ : నన్ను తమ శిష్యునిగా స్వీకరించరూ ? బాల్యము నుంచీ తీర్థయాత్రలు చేద్దామనే కోరిక నామనస్సును పట్టుకొని పీడిస్తోంది. నా అదృష్ట విశేషంవల్ల మీరు ఈనాడు నాకు దర్శనమిచ్చారు . తమ అనుగ్రహం

సిద్ధు : వత్సా, నీ వేయే తీర్థక్షేత్రములు చూడవలెనని ఉబలాటపడుతున్నావు.

ప్రవ : తమరు సెలవిచ్చారుగదా; దర్శనము వల్లనే ముక్తి నిచ్చేది చిదంబరమని! మొదట చిదంబరం చూచి-

సిద్ధు : కాదు కాదు. హిమాలయపర్వతములందు హరి ద్వారము ఆవలనున్నది. దేవభూమి. ఆ దేవభూమిలో యక్ష గంధర్వులు విహారము చేస్తూంటారు. వారు గాన సార్వభౌములౌటవల్ల నిత్యమూ పార్వతీ పర మేశ్వరులనుగూర్చి పాటలు పాడుతూఉంటారు. ఆ దేవభూమిలోనేగాదా పురాణ దంపతులు పార్వతీ పరమేశ్వరులు కాపురముండేది——

ప్రవ : అవును స్వామీ, హిమాలయమునందలి తీర్థక్షేత్ర ములనుకూడా దర్శించవలెననే ఆసక్తికూడా కద్దు స్వామీ, కాని తలస్థ పడేదెల్లా ?

సిద్ధు : మీవంటి శ్రోత్రియులనుచూస్తే మాకు అనుగ్రహం కలుగకుండా ఉంటుందా ? నేను మీపాదములకు పాద లేపము పూస్తాను. వెంటనే దేవభూమికి వెళ్ళి దివ్యస్థలములను దర్శించుకోండి.

ప్రవ : నేను ఆ ప్రదేశములకు క్రొత్తవాడగదా. ఆయా క్షేత్రములు నాకెట్లా తెలుస్తవి ? ఇవి ఫలానా అని చెప్పడానికి అక్కడెవరైనా ఉంటారా ?

సిద్ధు : అవసరంలేదు, పాద లేపప్రభావంవల్లనే ఆయాస్థలముల విశేషము మీ మనస్సుకు స్ఫురిస్తూంటుంది. రాతునా పాద లేపము ?

ప్రవ : చిత్తం, ధన్యుణ్ణి... ఒసే సోమిా, ఒసేవు సోమిా...

అన్న : ఆఁ, పిలిచారా ?

ప్రవ : అవునుగాని చూడూ, ఇప్పుడే అలా వెళ్ళివస్తాను. ఈ మహానుభావుడు మనకు అతిథిగా ఉంటారుగాని—

సిద్ధ : నే నుండడానికి వీల్లేదు. ఇంకోమారు వస్తానులెండి. మిమ్మల్ని పంపించి నేను వెళ్ళిపోవాలి.

ప్రవ : చిత్తం. తమ అనుగ్రహం. సోమిా, వీరుండరుట. నాన్నతోటీ అమ్మతోటీ చెప్పు - శీఘ్రముగానే వస్తానని—

అన్న : దేవతార్చన చెయ్యకుండా వెడతారా ?

ప్రవ : మళ్ళీ వచ్చి చేస్తాను - ఆనందవల్లి వల్లె వేయమని శిష్యులతో చెప్పు.

అన్న : సరేకాని, అత్తగారు, మామగారు ఉండలేరు సునుండీ, చప్పున రండి.

ప్రవ : అలాగే! పాదలేపం పూశారా స్వామిా...

సిద్ధ : పూశా. లేచి నిలిచి 'హిమగిరికి పోవలెను' అని సంకల్పించు కోండి—

ప్రవ : చిత్తం.

సిద్ధ : 'జయ పరమేశ్వరా' అని ఎగరండి.

ప్రవ : జయ్ పరమేశ్వరా... (సిద్ధుడు శంఖము నూదును)

సిద్ధ : బ్రాహ్మణుడు ఆకాశగామియై పోతున్నాడు. నేను సంకల్పించిన కార్యం ఇంతవరకు నిర్విఘ్నంగా కొన సాగింది. స్వాయంభువ మనువు పరిపాలను అంతము

కానున్నదనీ స్వారోచిషమనుసంభవానికి కాలము సమీపించినదనీ దేవతలు చెప్పారుకదా! స్వారోచిష మనుసంభవానికి బ్రాహ్మణ గంధర్వ సంసర్గ అవసర మనీన్నీ ఆ కార్యము నన్ను సాధించమనీ ఆదేశించారు. గంధర్వనారీ హృదయంలో బ్రహ్మతేజం హత్తు కొన్నప్పుడు ఆవిర్భవించే పురుషుడు స్వారోచిషమను సంభవానికి కారకుడు కావాలట. బ్రహ్మతేజముతో వెలిగే ప్రవరసోమయాజులు అందుకు తగినవాడని గ్రహించి 'ఇతడు కర్మిష్ఠిగదా, ఎట్లా ఇతనిని గంధర్వ భూమికి పంపగలనా' అనుకున్నాను. బుద్ధిజాడ్య జని తోన్మాదము కల్గిస్తేనేగాని ఈ శ్రోత్రియుడు హిమా లయానికి పోజాలడని ఊహించి తీర్థయాత్రాకథలతో ఆతని బుద్ధిలో మార్పు కల్గించగలిగాను. స్వారోచిష మనుసంభవానికి బీజము పడినది. ఇక పరమేశ్వరాను గ్రహము. హర హర మహాదేవ శంభో...

(హిమాలయ పర్వతంమీద ప్రవరుడు. భాగీరథీ ప్రవాహం, పక్షుల కలకలాలు, జంతువుల ధ్వనులు)

ప్రవర : అహో! సహస్ర శిఖరాలమీద తుషార కిరీటాలు ధరించి హిమవంతుడు దర్శనమిస్తున్నాడు. పార్వతీ పరమేశ్వరుల విహారభూమి కన్నుల పండువు చేస్తు న్నది... పరమేశ్వరా అనుగ్రహించు. ఇవే నీకు సహస్ర దండప్రణామాలు.

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం

నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమో నమః శంకర పార్వతీభ్యాం...

పవిత్ర గంగా ప్రవంతి హోరున ప్రవహిస్తున్నది నేత్ర పర్వముగా. దూరాన్ని హిమవర్షములు కురుస్తున్నవి. ఏమి యీగాలి- ఈ చలి... నేను పాదలేప మహిమ వల్ల ఆకాశమున కెగిరివచ్చి దిగిన యీ ప్రదేశం నర నారాయణ చరణ చిహ్న ముద్రితమైన బదరీ వన మని మనస్సుకు స్ఫురిస్తోంది. అదిగో-అక్కడ తొండ ములు పైకెత్తి యేనుగులు అందుగుచిగుళ్ళను అందు కొంటున్నవి. కణుజులు విద్యుద్వేగంతో ప్రేళ్ళు దాటుతున్నవి... ఇక్కడంతా నిర్మానుష్యముగా ఉన్నదే! కొంత ముందుకుపోతే, విశేషాలు మన స్సుకు పొడగట్ట వచ్చును... ఓహో...

నిడుద వెన్నెరిగింపు జడకట్ట సగర ము
న్మనుమండు తపము గైకొనినచోటు
జరఠ, కచ్ఛప కులేశ్వరు వెన్ను కానరాన్
జగతికి మిన్నేరు దిగినచోటు
పుచ్ఛకతనంబు పోబెట్టి గిరికన్య
పతిగోల్వ ఆయాసపడినచోటు
వలరాచరాజవాడలికాక్షు కనువెచ్చ
కరగిన అల కనికరపు చోటు

తపసి యిల్లాండ్ర చెలువంబు తలచి తలచి
మున్ను మురుప్పిచ్చిను విరాళి గొన్నచోటు—

ఓహో! కైలాసగిరి దర్శనమిస్తూంది, మంచు తెలు
లాచ్ఛాదింపగా ఈ రెండలో ధగద్ధగాయమానమై
జ్యోతిర్లింగము వలె వెలుగుతూంది. ఆ ప్రణవ
నాదము ఎంత స్పష్టముగా ప్రతి ధ్వనిస్తూంది. నా
లోలోపల మార్మోగుతూంది. ఓం ఓం ఓం...

తలమే బ్రహ్మకునైన ఈనగ మహత్వం బెన్న? నేనియ్యెడన్
గల చోద్యంబుల రేపు కన్గొనియెదన్ గాకేమి?
నేడేగదన్

నలినీ బాంధవ భానుతప్త రవి కాంతస్యందినీహార కం
దళ చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్
తెల్పెడిన్...

ఇంక నే నింటికి వెడతా. వరుణానదీ తీరమందున్న
అరుణాస్పదపురము చేరాలి నేను... జై పరమేశ్వరా!
జై పరమేశ్వరా! ఏమిది! నా కాళ్ళు రావే! దేహము
ఊర్ధ్వముఖముగా కదలదే? పాదములకు పూసిన సిద్ధ
లేపము పోయిందే! అయ్యో, మంచులో కరిగి
పోయింది. ఏమిటింక చేసేది? ఈ చలిలో బ్రతకడ
మెలా? నాకెవ్వరు తోడు? అయ్యో!

నన్ను నిముసంబు కానకయున్న ఊరెల్ల
అరయు మజ్జనకు డెంత తడలునొక్కొ
ఎపుడు సంధ్యలయందు ఇలువెళ్ళనీక న
న్నోమెడు తల్లి యెంతొరలునొక్కొ
అనుకూలవతి, నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
కెడఁగోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు ఎంత చింతింతురొక్కొ

అతిథి సంతర్పణంబు లేమయ్యెనొక్కొ
అగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యముల బాపి, దైవంబ, కినుక నిట్లు
పారవైచితె మిన్నులు పడ్డచోట ?

నా తెలివి తక్కువతనానికి దైవాన్ని దూషించడం తప్పుగాదూ? ఏ కాశీ గయా ప్రయాగలో సేవించక, ఈ మంచుకొండకు నే నెందుకు రావాలి? ఇప్పుడు నేనింటి కెలా చేరడం ?

అక్కడేదో వీణాగానం వినిపిస్తూంది ... అన్నట్లు సిద్ధుడు చెప్పాడుకాదూ—— ఇక్కడ గంధర్వులుంటారని? నా కింటికి త్రోవచూపే పుణ్యం కట్టుకుంటారేమో చూసివస్తా... అదిగో, అక్కడో భవనం కనిపిస్తూంది. మాణిక్యాలూ పచ్చలూ పొదిగిన చక్కని మందిరం... ఎవరా అమ్మాయి ? త్రిలోకసుందరి!

రెప్ప వాల్చక, చూస్తోంది... వీణ వదలి వచ్చి
నాదారి కడ్డంగా పోకబోదె నానుకుని నిలబడింది —

వరూ : ఆయన త్రిలోక మోహనమూర్తి ఎవరో ?

ప్రవ : (ఇంటికి దారి అడగనా? తప్పేముంది?) అమ్మాయీ,
చిరంజీవ ..

ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిచరించెదో టలే
కివ్వనభూమి? భూసురుడ నే ప్రవరాఖ్యుడ త్రోవతప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుంజను దెంచి పురంబు జేరనిం
కెవ్విధిగాంతు? తెల్పగదవే తెరువెద్ది? శుభంబు నీకగున్..

వరూ : ఓహో ఓహో ఓహో ఏదీ, అమ్మాయీ అని మళ్ళీ
అను! ఏదీ మళ్ళీ నీపేరుచెప్పు? ఎందుకువచ్చావో మళ్ళీ
చెప్పు ? తాగినకొద్దీ అమృతం తాగాలనే ఉంటుంది.
నీ వాక్య పీయూష నా తృష్ణను రేపుతోంది. ఎవరు
నీపేరు? (మనోహరంగా... అని గట్టిగా నవ్వుతుంది)

పవ : ఏమిటా చిలిపి చేష్టలు. వినిపించలేదూ ? నాపేరు
ప్రవరసోమయాజులంటారు.

వరూ : సోమయాజులా ? యజ్ఞం చేశావా ? ఎవరి కౌగిళ్ళ
సుఖించడానికీ-అధ్వరకర్మ చేస్తారు ? నీ రాకకు కార
ణం అదన్నమాట ... అవునా, నాముద్దులమూటా ...

పవ : నాపేరు ప్రవరుడు. నాకు ఒక సిద్ధుడు—

వరూ : ఆగు ఆగు! నీపేరు ప్రవరుడు కాదు. నీపేరు నే
చెప్పనా ? నీపేరు మన్మథుడు, నీపేరు జయంతుడు
అవునా? నీపేరు నలకూబరుడు. నీపేరు వసంతుడు.

కాదూ? నీపేరు చలువలు చల్లే చందమామ! అవును కాదూ? అను, అవునను—

ప్రవ : ఎవరో ఈ పిచ్చిపిల్ల! ఈ దివ్యసౌందర్యంలో ఈ చాంచల్య లక్షణమేమిటో? అమ్మాయీ, నేను దారి తప్పాను. ఒక సిద్ధుడు పాదములకు పసరుపూయగా దాని ప్రభావంవల్ల ఇక్కడికివచ్చాను. ఇక్కడ దివ్య స్థలములు కొన్ని చూచాను. మంచులో పసరు కరిగి పోయింది. నీకు పుణ్యముంటుంది. నాకు మా ఊరికి- అరుణాస్పదముకు దారిచెపుతూ?

వరూ: ఇంకా, నీవుచేసిన అధ్వర ప్రభావమువల్లకాదూ ఇక్కడికి వచ్చినది?

ప్రవ : అధిక ప్రసంగం చెయ్యకు తల్లీ. అధ్వరాలు చేసిన వారికి మరణించిన పిమ్మటనే స్వర్గవాసం లభిస్తుంది. నేను బ్రతికిఉన్నాను.

వరూ: అమ్మో, నీకు కోపంకూడా ఉన్నదే! సజీవుడవే నువ్వు? నిజమే! లేకుంటే నీ కన్నులు వదన లావణ్యాంబు సంభూత కమలములవలె ఉంటవా? చెప్పు. మన్మథాస్థానపీఠమువలె నీ విశాలోర స్థలముంటుందా? చెప్పు. బంగారుకాంతి, సూర్యతేజస్సు, చంద్ర శైత్యము కలిపి ముద్దచేసి నిన్ను బ్రహ్మదేవుడు సృజించాడు కాదూ? నా మోహనాకారా...

ప్రవ : అమ్మాయీ, ఆడవాళ్ళు అనేమాటలేనా అవి. నేను దారితప్పి వచ్చానంటే దారిచూపక ఏమిటీమాటలు?

వరూ: అలాగటండీ మన్మథుడుగారూ, దారితప్పారా? నేను ఆడేవి ఆడవాళ్ళ మాటలు కావూ? తమరు ఒంటరి స్త్రీని పలకరించడం పురుషుల కార్యాలు కాబోలు! ఏమి- మాటాడ రేం? నవ మన్మథులు!

ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర ఏ కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబడి పల్కరించులా గింతియకాక నీ వెరుగవే మునువచ్చిన త్రోవచొప్పు? నీ కింత భయంబులే కడుగ, నెల్లిదమైతిమి మాటలేటికిన్.

ప్రవ : అమ్మాయీ, నిన్ను నే నెందుకు చుల్కన చేస్తాను! దారి చెప్పమన్నాను, అంతేకాదూ?

వరూ: అమ్మాయిట-నన్ను చులకన చేయడానికన్న మాటలు కావూ నీవన్న మాట లబ్బాయీ?... నన్నెవ తెగా భావించావో? నాపేరు వరూధిని. రంభ, తిలోత్తమ, హరిణి, శశిరేఖ మున్నగు అప్సరసలు నాచెలికత్తెలు. లక్ష్మి నా తోబుట్టువు... మేమీ శీతనగం మీద సంచరిస్తూ ఉంటాము. ఈ ఉద్యానవనాలు చూశావూ? ఇవన్నీ మనవే! ఈ రత్నకందరాలు మనవే; ఈ రత్నరాసులూ మనవే! అవునా సుంద రాంగా...

ప్రవ : నాకు మతిపోతోంది. నీవు లక్ష్మిదేవి తోబుట్టువ వైతే నీకు నమస్కరించాలో- ఏమిటో? ఆడపిల్లవు నిన్ను - దీవించాలో ఏమిటో?

వరూ: నమస్కారం అనకు ప్రవరా, తప్పు తప్పు. నీవు చేయ దగ్గపని దీవించడమూ కాదు, నమస్కరించడమూ కాదు. మరేమి చెయ్యాలో చెప్పనా? నీవు మా యింటికి వచ్చిన చుట్టానివి. బహు దగ్గరచుట్టానివి. రా, కూచో, విశ్రాంతి తీసుకో ...

ప్రవ : నేనింటికిపోయి నిత్యకృత్యములు తీర్చవలసి ఉన్నది. వృద్ధులు-నా జననీజనకులు వేచిఉంటారు.

వరూ: సరే వెళ్లవచ్చునులే. ఇక్కడ భక్ష్యభోజ్యా లనుభ వించు. వస్త్రమాల్యములు ధరించు. కస్తూరీ చందన కర్పూరాదులు ఒంటికిపూసుకో. చల్లగాలి వీస్తూంటే రత్నపీఠము మీద కూచొని నేను వీణమీద పాడే ప్రణయగీతాలకి తాళంవెయ్యి. ఇంటికేమిలే, ఇంటికీ, వెడుదుగాని ...

ప్రవ : కాదు – నేను ఊరికి పోవాలి. నాకు దారి చూపు. అమ్మాయీ నామాటవినవూ, నా తల్లివికదూ, అమ్మవికాదూ ...

వరూ: ఎంత చక్కగాఅన్నావు అమ్మ అని ... నన్ను అమ్మ అనకు. నన్ను ఏమనాలో చెప్పనా ?

ప్రవ : బంగరుబొమ్మ అనాలా ?

వరూ: ఆ, అవును అవును- మళ్లీ అను బంగరుబొమ్మ వరూధిని ...

ప్రవ : నన్ను గోడవబెట్టుతున్నావు చిన్నదానా ? నాకు ఇంటికి తెరువుచూపవూ? నీకు పుణ్యముంటుంది.

వరూ: అనవేంబంగరుబొమ్మ అని. 'వరూధిని బంగరుబొమ్మ' అను—

ప్రవ : తల్లీ మీరు గంధర్వులు. మీ కసాధ్యమైన దేదీ లేదు. మీ మహాత్మ్యములు దివ్యములు. మా వూరు చేరడానికి ఉపాయము చెప్పవూ ?

వరూ: అస్తమానం ఊరు ఊరు - ఇల్లు ఇల్లు అంటూ కూచుంటాం వేం—

ఎక్కడి యూరు కాల్నిలువ కింటికిబోయెదనంచు బల్కెదీ
వక్కట మీ కుటీర నిలయంబునకున్ సరిరాకపోయెనే !
ఇక్కడి రత్న కందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగ సైకతము లిక్కడి యీలవలీని కుంజముల్!

చూడు - సుర సిద్ధ కిన్నెర గంధర్వులు ఆడుకోనే చోటు చూపనీ నీకు! కోయిలలు నిత్యమూ పలికే పూలవృక్షములతో నిండిన ఉద్యానాలలో విహరిద్దామా మనము ?

ఈ పూవు పొదరిండ్లలో మన మాడుకొందామా ! ఈ కమలాకరములో ఈ పద్మపుష్పాలను తెప్పగా జేసుకొని మనం విహరిద్దామా !

పవ : అమ్మాయీ నువ్వేదో చెబుతున్నావుగాని, నా మన స్సిక్కడ లేదు. నేను తొందరగా మా యింటికి పోవాలి. నిత్యనైమిత్తిక కర్మలు చేసుకోవాలి. నా ఉపకారం చెయ్యవూ !

వరూ: నామాటలు నీకు వినిపించడంలేదూ ... దేవతాస్త్రీని-
నీకు ప్రత్యక్షమై సుఖములు పంచిపెడతానంటూంటే
నీ మనస్సెక్కడలేదూ ? ఒక్కమాట చెబుతున్నాను,
జాగ్రత్తగా విను. వింటావుకాదూ ...

ప్రవ : అగ్నికార్యము మించిపోయినట్లే. ఇక చేసేదేమిటి! ఆ
చెప్పేదేమిటో చెప్పు-వింటాను.

వరూ: సావధానముగా విను.

నిక్కము దాపనేల ధరణీసుర నందన నేడు నీ పయిన్
జిక్కె మనంబు నాకు... ...

ప్రవ : హరి హరీ! ఇలాంటి బుద్ధులు పుడుతున్నాయేమి నీకు-
గంధర్వ కాంతకు ? అన్నా ...

వరూ: .........నను జిత్తజు బారికి వప్పగించెదో

చొక్కి మరందమద్యముల చూరలు బాటలుపాడు తేంట్ల సొం
పెక్కిన యట్టి పూవు పొదరిండ్లను గౌగిట గారవించెదో...

ప్రవ : శివశివా! ఎంతమాట వినిపించింది? న్యాయమేనా తల్లీ
విప్రుని కామించడం ? విప్రులు భోగములు కాంక్షించ
రాదు సుమీ! ఇహాన్ని కష్టాలనుభవించి పరాన్ని
సుఖాలను పొందుతారు వారు.

వరూ: సుకుమార శరీరా ! ఉపవాసవ్రతములతో దేహ
మును శుష్కింప చేసుకోడానికా నీవు పుట్టింది. నీవు
చేసిన యజ్ఞములకు ఫలముగా సశరీర స్వర్గమును నీకు
ఇస్తానంటే వద్దనడం వివేకమేనా ?

ప్రవ : తల్లీ! బ్రాహ్మణ ధర్మము నీకు తెలియదు. మన్మథ బాణములకు గురియై బ్రాహ్మణుడు బ్రహ్మానందాధి రాజ్యమునుండి జారిపోయి భ్రష్టుడు కాడటమ్మా.

వరూ: ఇదా నీ చదువు—ఛాందసుడా ...

ఎందేఔందము కందలించు రహించే నేకాగ్రతన్ నిర్వ్యతిం
జెందున్ గుంభగత ప్రదీప కళికాశ్రీదోప యెందెందు బో
కెందే నింద్రియముల్ సుఖంబగును నాయింపేపరబ్రహ్మ మా
నందో బ్రహ్మయటన్న ప్రాజదువునంతర్బుద్ధి నూహింపుమా.

ప్రవ : ఇంద్రియముల నేకాగ్రముచేసి పొందిన విషయానం దమే బ్రహ్మానందమా ? ఇట్టి ఆనందమే బ్రహ్మమా ? ఎక్కడ నేర్చావమ్మా ఈ చదువు ...

ఈ పాండిత్యము నీకుదక్క మరియెందేగంటిమే ? కామశా
స్త్రోపాధ్యాయివినా వంచించెదవు మేలోహో త్రయీ
ధర్మముల్
పాపంబుల్ రతిపుణ్యమంచు నికనేలా తర్కముల్ మోక్షల
క్ష్మపథ్యాగమ సూత్రపంక్తికివెపో మీసంప్రదాయార్థముల్.

వరూ: మహా గొప్ప చదువు చదివేవులే, నీవు. నీమాత్రం చదువు చదువలేదు కాబోలుపరాశరుడు – యోజన గంధినతడు గ్రహించలేదూ ? మేనకను తన అక్కున బిగించిన విశ్వామిత్రుడికి నీకున్నంత చదువు లేదనుకుంటాను. అహల్యా జారుడైన ఇంద్రుడు మీరుకోరే నాకలోకానికధిపతి సుమా ... అతడికీ నీకున్న చదువులేదు – మావంటి దేవతాకన్యలను

పొందిన మాందకర్ణిని ఎరుగుదువా ? వారికంటె నీవు గొప్పవాడవు కాబోలు! మీసంగతి నాకు తెలుసులే, ఇనుప కచ్చడాలు బిగించిన మునిముచ్చులంతా తామరసనేత్రల ఇళ్ళల్లో ఖైదీలుసుమా ... రా, నాతో. రా వీణ వాయించుకుందాము. చెప్పిన మాట విను.

ప్రవ : చెయ్యిపట్టుకోకు, నేను రాను. అయ్యో చెయ్యి వదులు. ఎవరైనా పూర్వులు ఆశించారంటే అది వాళ్ళ ప్రారబ్ధము.

వరూ: నీకెంత దయలేదు ప్రవరా ? నీ హృదయమెంత కఠినము ? ఈ నా సుకుమార శరీరాన్ని ఈ నా వెన్న వంటి మనస్సును-నీ కర్పిస్తుంటే కాదని- హవ్యమనీ కవ్యమనీ,అరణులనీ, దర్భలనీ అంటావేమిటి ?
ఓ దయామతీ, ఓ ప్రవరా, ఓ ప్రాణనాయకా! నిన్ను విడిచి ఒక్కక్షణమైనా జీవము పట్టజాలను. నేను అనృతము పలకడంలేదు, నమ్ము. నన్ను వరించి నాకు అనునయము సంధించు. నీవు అవశ్యమూ ఇంటికే వెళ్ళాలంటావా ? పోనీ అలాగే వెడుదువు గాని, నాతో కొన్నాళ్లు ఇచ్చట ఇష్టోపభోగాలనుభవించిన పిమ్మట నిన్ను పంపుతాను. వనిత తనంత తావలచి వచ్చినప్పుడు చులకన చేయరాదు — రా ... రా ... ...

ప్రవ : ఆగు, ఆగు. చేతులుచాచి అలా మీదకు వస్తావేమిటి —అమ్మాయి, మీద పడతావా ఏమిటి?

వరూ: రా ప్రవరా – నా ప్రాణాధిపతివి కాదూ! రా సుంద రాంగా–నాకల్పవృక్షానివి కాదూ! రారామనోహరా! ఇదిగో నా కౌగిలి. ఈ నా కౌగిలిలో వెచ్చగా సుఖము ననుభవించు. రావూ... రావూ...

ప్రవ : దూరముగా ఉండు. దూరముగా ఉండు.

వరూ: రావూ, కోటి మన్మథస్వరూపా! రావూ నవ్యనవనీత హృదయా! చూడవూ, ఈనా ప్రాంచద్భూషణములు! చూడవూ, కస్తూరితో రచితమైన ఈ నా మకరికా పత్ర ములు. అయ్యో కళ్లు మూసుకోకు. చూడుచూడు— ఈ నా లావణ్యసముద్రములో మునుకలు పెట్టవూ! ఈ నా నీ సౌందర్యరాసులను ఏకము చేసు కొందామా...

ప్రవ : మీదపడింది ఈపిల్ల – అనుకుంటూనే ఉన్నాను. ఎంత దారుణం... పో పో దూరంగా పో...

వరూ: ఏడుస్తూ;

పాటున కింతులో ర్తురె కృపారహితాత్మక నీవు శ్రోయ ని
చ్చోట భవన్నఖాంకురము సోకె—

చూడు– అయ్యో ! ఎంతబాధ–ఎంతబాధ! యజ్ఞాలు చేశావుట కాదూ ? తపస్సులు చేశావుట కాదూ ? ఎందుకొచ్చిన చెయ్యడాలు–రవంతైనా దయాదాక్షి ణ్యాలు లేకపోయాక! చదివినచదువుకు లక్షణమిదేనా ఏమిటి ? ఆడవాళ్ళమీద చెయ్యి చేసుకుంటావా ?

నాకు ప్రాణంమీద ఇంక ఎలాగూ లేదు ఆశ. నన్ను చంపిన పాపాన్ని పోతావులే నువ్వు. అయ్యో...

ప్రవ : ఒంటినిండా జవ్వాజి- చందనం పట్టుకొన్నాయి. గంగలో కడుక్కొని, ఆచమనం చెయ్యాలి.-ఇక్కడ నాయింటికి మార్గము చూపేవారెవ్వరూ లేరు. అగ్నిహోత్రుడే నాకు దిక్కు. అతన్నే నేను ప్రార్థించుకుంటాను... ఓ జగజ్జీవా... అగ్నిదేవా...

దివిషద్వర్గము నీ ముఖంబున నతృప్తింగాంతు నిన్నీశు గా
స్తవముల్ జేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివిః నీవ ఆ
హావనీయంబును, దక్షిణాగ్నియును నీయం దుద్భవించుః
క్రతూత్సవ సంధాయక నన్నుగావగదవే,స్వాహావధూవల్లభా

వరూ: ప్రవరా, నాథా, వెళ్ళకు వెళ్ళకు. నిన్ను ముట్టుకోనులే. నిన్ను చూచుకుంటూ ఉంటాను. దూరంగానే ఉంటాను. నీవు మాట్లాడుతుంటే నీమాటలు వింటూ ఉంటాను. నీమీదనుంచి వచ్చే గాలి నాకుసోకితే చాలు. ఆ ఆనందమే అనుభవిస్తూ ఉంటాను. వెళ్ళకు ప్రవరా- వెళ్ళకు. వెడితే నామీద ఒట్టుసుమా ...

ప్రవ : దానజపాగ్నిహోత్రపరతంత్రుడనేని, భవత్పదాంబుజ
ధ్యానరతుండనేని, పరదార ధనాధుల గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పుమినుండు
పశ్చిమాం
భోనిధిలోన గ్రుంకకయమున్న రయంబున
హవ్యవాహనా...

వరూ: వద్దు ప్రవరా, వద్దు వెళ్ళకు. అయ్యో, నా ప్రవరుణ్ణి ఏదో దివ్యతేజం పొదువుకుంది. పైకి తీసుకు పోతోంది. నాచిత్తచోరా, నా ప్రాణనాథా, ప్రవరా దిగు, దిగు. దిగవూ, నా ప్రవరా దిగవూ! అయ్యో నా ప్రవరుడు ఆకాశంలో మాయమయ్యాడు. అయ్యో అయ్యో… …

(మేనక, హారిణి, మంజుఘోష, ఊర్వశి, ప్రవేశం)

హారిణి: బ్రహ్మ సభలో నాట్యం చెయ్యడానికివెళ్ళి మేనక ఇప్పుడే వచ్చింది. దానికిక్కడి విశేషాలు తెలియవు.

మేన: ఏమిటమ్మా, ఆ విశేషాలు…

మంజు: మన వరూధినే మేనకా! ఒకనాటి సాయంత్రము చూతునుగదా, పోకవనంలో స్మృతితప్పి పడిఉన్నదే! బుజాలమీద గోటినొక్కు రక్తం చిమ్ముతూ కనిపించింది.

మేన: ఎందుచేత పడిపోయింది పాపం.

మం: ఊర్వశి చూచిందట-పడడం.

మేన: ఔనే, ఊర్వశీ?

ఊర్వశి: నేను కమలాకరం ఒడ్డున కూర్చుండగా ఒక తేజస్సు ఆకాశంలో కనిపించింది. అదేమిటా అని పరకాయించి చూతునుగదా—దివ్యమంగళ స్వరూపుడైన పురుషుడే—ఆకాశగమనం చేస్తూ పోతున్నాడు.

మేన: ఖేచరుడా…

ఊర్వ: కాదు. మానవుడే నే సరిగదా, అని ఉద్యానంలో తిరుగుతూంటే పడిపోయిన వరూధిని కనిపించింది. అప్పుడు నేను కేకలేస్తే మనవారంతా వచ్చారు. ఏదో తంటాలు పడి దానికి స్మృతి వచ్చేటట్లు చేశాము.

మేన : పాపం ఇంకేమీ దెబ్బలు లేవుగదా ?

మం : దెబ్బలూ లేవు, చట్టుబండలూ లేవు. లేచింది మొదలు కొని 'నా ప్రవరా, నా ప్రవరా' అంటూ వలవరిస్తూ వద్దన్నా మానకుండా అడవి అంతా తిరగడం మొదలెట్టింది.

రంభ: ప్రవరా అనడంలో అభిప్రాయం ఏమిటో ...

మం : చివరికి బతిమాలి బతిమాలి తెలుసుకొన్నాము. ఒక బ్రాహ్మడు, పేరు ప్రవరుడు, దివ్యసుందరవిగ్రహ మట... తన భవనం దగ్గిరికి వస్తే తాను వలచిందట. అతడు దానిమాట కాదని తప్పించుకు పోయాడట.

మేన : వాడు పిచ్చివాడో, బాలుడో ? ఏమిటో ? వరూధిని వలస్తే ఎవరు కాదనగలరు—అందులో మానవుడా ? బ్రాహ్మడా ?

హరి : ఈ బ్రాహ్మలెప్పుడూ ఇంతేనే...

మం : మేనకా, ఇది విరహబాధగదా అని గ్రహించి దానికి ఉచిత శైత్యోపచారాలు చేశాము. ఎంత చేసినా లాభం లేకపోయింది.

మేన : ఆ పిచ్చి క్రమంగా తగ్గుతుందిలే. ఇప్పుడెక్కడ ఉంది అది ?

హారి : భవనంలో కూచుని పలవరిస్తోంది. రండి. ఇలా రండి, భవనం పక్క నిలబడితే ఆ మాటలు వినిపిస్తాయి. —(భవనంలో వరూధిని)— నన్ను విడిచి పోయావా ప్రవరా ? మళ్ళీ రావూ! నీకోసం నిద్రాహారాలు మానుకుని కనిపెట్టుకు ఉంటాను సుమా... అయ్యో నాకు చావైనా వచ్చిందికాదు. ఎందుకీ బ్రతుకు ? పాడింటిలో పెట్టిన దీపాలవలె నాఅంద చందాలు ఎవరికోసం ? అయ్యో ప్రవరా ! రావా, నన్ను రక్షించవూ...

మేన : దీనికీ మతిపోతున్నట్లుంది. లోపలికి వెడదామా ?

చంద్ర: మేనకా, ఒసే హారిణీ, ఒసే మంజూ రండి ఇలా రండి, చప్పున రండర్రా, ఒసే ఊర్వశీ, నువ్వూ రావే—

మేన : చంద్రరేఖ పిలుస్తోంది, వెడదాం రండి-మళ్ళీ వద్దాం వరూధినిదగ్గిరికి—

చం : ఓసెమ్మో మేనకా...

మేన : విన్నానే! వరూధిని మాటేనా? ఇందుకా పిలిచావు చంద్రరేఖా—

చం : కాదే, వినండర్రా మీరంతాను; మీరెరుగరూ కలి అనే గంధర్వుణ్ణి—

మం : వాడా, వెనక వరూధిని మోహించిన వాడేనా ?

ఊర్వ: మోహించి నిరాకరింపబడ్డ వాడా!

చం : ఔనే ఓసెమ్మా, వాడేనే, మన ఉద్యానవనం అంచున దూరంగా కనిపించాడే—వీడెందుకొచ్చాడు చెప్మా-అనుకుంటూంటే ఉన్నట్లుండి ఒక సుందర మానవస్వరూపం ధరించాడే! కుందనమువంటి శరీరం, బ్రహ్మ వర్చస్సు, చెవులకు కుండలాలు, మెళ్ళో యజ్ఞోపవీతం, సందెడు జుట్టు, చారెడు కళ్ళు—

మేన : నీకు మనస్సు చలించినట్లుందే వాణ్ణిచూస్తే, అంతగా వర్ణిస్తున్నావు—

చం : చూస్తే నీకుమాత్రం చలించదుటే ఓసెమ్మా—

ఊర్వ: ఎంతటి విడ్డూరాలేనా పుడుతున్నాయి. వీడు ప్రవరుడు వేషం వేసుకొన్నట్లున్నాడే!

మేన అయ్యో వీడిబుద్ధి... అదీ మంచికే వచ్చిందే...

మం : అవునే వీణ్ణిచూస్తే వరూధిని విరహం పోతుందేమో...

మేన : అదే నేనూ అనుకుంటూంట. వరూధినితో వీడు గంధర్వుడని చెప్పకండి.

ఊర్వ: ప్రవరుడే అనుకొంటుంది పాపం! ఒసే చంద్రరేఖా, నీవు గబగబా వరూధిని భవనానికి వెళ్ళి, ఎవడో బ్రాహ్మడు వచ్చాడనీ, వరూధినీ వరూధినీ అంటూ చెట్టూ పుట్టా వెతుకుతున్నాడనీ, చెప్పు. దాన్ని వాడి దగ్గరికి తీసుకువెళ్ళు-అవసరమైతే—

హరి : మనమంతా ఇక్కడే ఉండి, ఈ తమాషా చూద్దాము.

మేన : వరూధిని పాపం ఎప్పుడూ ఇంతేనే. తన్నుకావాలన్న గంధర్వుణ్ణి వద్దు పొమ్మంది. వాడు దీనికోసం గిలగిల

కొట్టుకుంటున్నాడు తను కావాలని కోరుకొన్న బ్రాహ్మడు దీన్ని వద్దు పొమ్మన్నాడు. ఇది వాడి కోసం గిలగిల కొట్టుకొంటోంది.

హారి : చూడండర్రా... అదిగో అదిగో వరూథిని! చంద్రరేఖ బుజాలమీాద చేతులు వేసి వేళ్ళాడిపోతూ నడుస్తోంది. చూడు, చంద్రరేఖ మనకేసి తిరిగి ఎలా కొంటినవ్వు నవ్వుతోందో...

మేన : అడుగోనే బ్రాహ్మడు— చంద్రరేఖ చెప్పినమాట నిజమే—ఎంత అందగాడో...

రం : వాడు మాయా ప్రవరుడే గాదుటే.—

మేన : అసలు ప్రవరుడూ ఇలాగా ఉన్నాడన్నమాట!

ఊర్వ: చంద్రరేఖా, వరూథినీ బ్రాహ్మణ్ణి సమీాపించారు. చూడుచూడు, వరూథిని చంద్రరేఖను వదిలిపెట్టి వాడిని కౌగిలిలో చేర్చుకొన్నది.

మేన : రండి, మనమింక పోదాము. చంద్రరేఖ పరుగెట్టు కుంటూ వస్తోంది. రండి...

# చక్రవాక మిథునము

దేశము : గోదావరి అద్దరి-ఇద్దరి

కాలము : ఆషాఢ మాసము; ఒకనాటి రాత్రి

పాత్రలు : చక్రవాకము; చక్రవాకి.

అద్దరిని చక్రవాకము, ఒక చెట్టుమీద
చిట్టచివర కొమ్మమీంద కూర్చున్నది.

ఇద్దరిని చక్రవాకి, ఒక చెట్టుమీద
చిట్టచివరి కొమ్మమీద కూర్చున్నది.

## ౧

## మొదటి జాము

చక్రవాకము: కువ కువ కువ, కూయి; కూయి; కూ ... యి.

చక్రవాకి. కూ ... యి; కూ ... యి; కూ ... యి.

చ.ము: గోదావరి హోరు పెట్టుతోంది- ఎందుకో చెప్పా!
ఈ గోలలో నా సఖి కంఠమే వినరాకుండా ఉన్నది.
కువ కువ కువ కువ కూ ... యి కూ ... యి.

చ.కి : కూ ... యి, కూ ... యి, కూ ... యి.

చ.ము: గోదావరీ తల్లీ! కొంచెం నీ హోరు తగ్గిద్దూ అమ్మా!
నీకు పుణ్యముంటుందీ! ఎక్కడా మాట వినబడకుండా
చేస్తున్నావు. కువ కువ కూ ... యి, కూ ... యి.

చ.కి : నా నాథుని పిలుపు లాగ వినిపిస్తోంది. నాలాగే యీ గోదావరీ ఎన్ని తిరుగుళ్ళు పడుతూ ఉందో ! కూ...యి, కూ...యి, కూ...యి.

చ.ము: ఆఁ. వినిపించింది. అవతల గట్టున ఉంది నాసఖి. దాని గొంతుకే అది. సందేహం లేదు... ఈ రాత్రి ఈ గోదావరి మాకడ్డు వచ్చిందా ! ఎప్పుడూ ఉపకారం అందరికీ చేసే యీ గోదావరి మాకిప్పుడు అపకారం చేస్తూ ఉందని మేమనుకోవలసి వచ్చింది గదా ! కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : ఎవరి గొడవ వారిది, ఎవరి ఆవేదన వారిది. ఒకరి కష్టసుఖాలు ఇంకొకరికి కావాలా ఏమిటి ఈ లోకంలో. గోదావరి గొడవ గోదావరిది; మా గొడవ మాది. కువ కువ కువ కూ...యి కూ.. .యి.

చ.ము: ఇంకా నాసఖి నాగొంతుక గుర్తించ లేదు కాబోలు. గోదావరితల్లీ ! ఇందరికి ఇన్ని ఉపకారాలుచేస్తున్నావు. కొంచెం నా పిలుపు అవతలిగట్టుకు చేరవేద్దూ ! ఎంత తహతహ పడుతోందో నాసఖి. కువ కువ కువ కూ...యి; కూ...యి కూ...యి.

చ.కి : చీకట్లు క్రమ్ముకు వస్తూఉన్నవి. ఒక్క నక్షత్రమైనా మెరయడంలేదు. గోదావరి మాట విననీయకుండా వున్నది. అసలు నా నాథుడు ఆ గట్టున వున్నాడో, లేడో గట్టిగా పిలిచి చూస్తాను. కువ కువ కువ కువ కూ...యి, కూ...యి, కూ...యి.

చ.ము: గోదావరికికూడా దయ లేకుండా వున్నది. ఏ చెట్టు అనుకుని ఏ చెట్టుమీాద కూర్చున్నానో ఈ చీకట్లో తెలియడంలేదు. నా సఖి గొంతుకే అనుకున్నాను. ఈ గాలి హోరులోనూ ఈ గోదావరి హోరులోనూ ఏ శబ్దమేదైనదీ తెలియడం లేదు. కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : నా నాథుణ్ని దగ్గిర కూర్చోబెట్టుకుని ముక్కుతో రెక్కలు దువ్వుతూ విలాసముగా వుందా మనుకుంటే ఈ చీకటి వచ్చిపడింది. ఆ గట్టున మంచి ఇసుకలూ చెట్లూ వున్నవి రమ్మని నాతో చెప్పి వెళ్ళిపోయి నాడు. నేనూ వెళ్ళవలెనని రెక్కలు విప్పేలోగా ఇంతటి కష్టదశ సంభవించనా ? ఎంత పిలిచినా పలక డము లేదు– ఏమైనాడోగదా నా నాథుడు. కువ కువ కూ...యి, కూ...యి, కూయి.

చ.ము: ఎన్ని రాత్రిళ్ళు వచ్చినా ఇంక ఎప్పుడూ నిన్ను వదిలిపెట్టనని మాట ఇచ్చేను నాసఖికి. ఈ ఎడబాటు ఎలాగ కలిగిందో తెలియకుండానే కలిగింది. ఏమను కుంటూ ఉందో నాసఖి నన్ను గురించి. పలకరిద్దా మంటే నామాట నన్ను దాటే వెళ్ళడంలేదు. కూ...యి, కూయి;...కూ...యి.

చ.కి : ఎందుకు వచ్చిన ఇసుకలు, ఎందుకు వచ్చిన చెట్లు ? ఉన్నచోట ఉంటే ఇన్ని పాట్లు రాకపోవునుగదా ? ఏదో అనుకోవడమే కాని ఎన్నిమార్లు ఇదివరలో

ప్రయత్నము చేశాముకాము, చీకటి పడేటప్పటికి ఒకరి నొకరు విడవకూడదని. ఎప్పటి కప్పుడు ఏదో ఒకటి సంభవిస్తూ వుంది. పోనీ ఏమి వచ్చినా బ్రతికి ఉన్నాడనుకొని సంతోషించడానికైనా మాట విన బడితే గదా. కువ కువ కువ కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: అయ్యో, ఈ చీకట్లో ఈ గుడ్లగూబ కూతలేమిటి? ఈ కీచురాళ్ళ గోల యేమిటి? ఈ పక్షుల గొడవ యేమిటి? ఇదంతా ఎందుకు నా చెవిలో పడాలి. నా సఖి మాట నాచెవి కెందుకుచేరదు? అయ్యో, కువ కువ కూ...యి; కూ... యి; కూ... యి.

చ: కి ఈ కొమ్మలమీద ఈ పక్షులు ఏలాగున ప్రసంగించు కొంటున్నాయో? ఈ మెరుగుడు పురుగులు ఎలాగ వాటికి కాగడాలు వేస్తున్నాయో? ఈ నక్షత్రములు మబ్బుల వెనకనించి ఎలాగున నవ్వుతూ మాయమవు న్నాయో? ఈ అవస్థ మాకే రానా? అమ్మయ్యో! ఎక్కడున్నాడోగదా, నా నాధుడు! కువకువ, కువకువ కూ...యి, కూ...యి, కూ...యి

చ.ము: ఈ గొడవలతో నాకు లాభములేదు. మనస్సు చెదర కుండా నా సఖి మీదనే లగ్నముచేసి పిలుస్తాను. విన బడకుండా ఎందుకు ఉంటుందో చూస్తాను. ఇంకో ప్రసంగము నా కెందుకు? కువ కువ కువ, కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : దుఃఖంలో సుఖాన్ని తలుచుకొంటే ఆ దుఃఖం ఎక్కువౌతుంది. ఎవరి సుఖదుఃఖాల సంగతి నా కెందుకూ? నా నాథుణ్ణి పిలవడం తప్ప ఇంక నాకేమీ పని ఉండగూడదు. లక్ష్యము చెదిరిన కొద్దీ దుఃఖము ఎక్కువ అవుతూనే ఉంటుంది. ఇంక నాకు ఒక్కటే పని. కువకువ, కువకువ, కూ...యి, కూ...యి, కూ...యి, కూ...యి, కూ...యి.

చ.ము: కూ...యి కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : కూ...యి, కూ...యి, కూ...యి, కూ...యి.

## ౨

## రెండవ జాము.

చ.ము: కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : కూ—యి, కూ—యి, కూ—యి.

చ.ము: నోరెండుకు పోయింది. గొంతుక బొంగురు పోయింది. నా సఖి నా కంఠాన్ని గుర్తించలేదు; నేను నా సఖి కంఠాన్ని గుర్తించలేదు. ఏమయినదో గదా నా ప్రాణేశ్వరి. ఎంతకాలమో గదా ఈ అనుభవమూ, కూ—యి, కూ—యి.

చ.కి : ఈ నల్లటి మేఘాలన్నీ ఆకాశాన్ని చుట్టబెట్టుకొంటు న్నవి. ఈ మెరుపులేమిటి? ఈ పిడుగులేమిటి? ఈ పిడుగులమధ్య నా పిలుపు ఏమి కాను? అయినా

పిలవకుండా ఎలాగ ఉండడం, కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: ఈ గోదావరి హోరును మించి, ఈ పిడుగుల చప్పుడు మించి నేను నా సఖిని పిలవగలనా? అయినా చూస్తాను. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : ఈ మాటు జాగ్రత్తగా వుండి మెరుపు మెరిసినప్పుడు నా నాథు డవ తలగట్టున వున్నాడేమో చూస్తాను. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: భగవంతుడు ఈ గాలివాన భయము ఏమీ లేకుండా నా సఖిని రక్షించడూ? కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : మెరుపు వచ్చింది; పోయింది. నా కన్నులు మాత్రం చీకట్లు క్రమ్మినవి. నా నాథుడు కానరాలేదు. లోక మంతా మాకు అపకారమే తలపెట్టినా, పోనీ ఈగాలి వానలో నా నాథుడు చల్లగా వుంటే చాలు. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: పంచభూతములూ మా మీద ఆగ్రహించినవి. వాటి నైనా ప్రార్థిస్తాను – నా సఖిని చల్లగా చూడమని, కూ—యి, కూ—యి, కూ—యి .

చ.కి : ఈ గాలి వచ్చి కళ్ళల్లో దుమ్ము కొడుతోంది. ఈ వాన రెక్కలన్నీ తడిపివేసింది. ఈ పిడుగుల వల్ల చెవులు గింగురు మంటున్నవి. ఈ మెరుపుల వల్ల కళ్ళు చీకట్లు పడినవి. ఇంక యెలాగ నా నాథుణ్ణి

పిలవడం, వినడం, చూడడం, పొందడం. ఎవరికీ దయ లేదేమిటి మా మీద! కూ—యి, కూ—యి, కూ—యి.

చ.ము: ఏమి వాయుదేవుడా, నీవు నా మాట నా ముఖం మీదే కొట్టకపోతే తీరదా? పోనీ నా పిలుపు అవతలి గట్టుకు తీసుకుపోరాదా? అక్కడ నాసఖి నా కోసం కొట్టుకొంటూ ఉంటుంది. కూ—యి,కూ... యి—

చ.కి : నిద్రపోయిన పక్షులన్నీ లేచి ఒకరి నొకరు అనునయించు కొంటున్నవి. నన్ననునయించేవా రేరీ? కూ... యి, కూ... యి...

చ. ము. నీవైనా నేను చెప్పినమాట విందూ వానదేవుడా! నిశ్శబ్దంగా రవంత సేపు నీ హోరు తగ్గిస్తివా; నా సఖిని పిలుచుకొంటాను. పోనీ చేతనైతే నా పిలుపు అవతలి గట్టుకు అందజేద్దూ. కూ...యి, కూయి.

చ.కి : ఈ వేళ అమావాస్య కూడా కాబోలు. చంద్రుడుంటే ఆశపెట్టనైనాఆశ పెట్టేవాడు? ఇప్పుడు ఆ ఆశ కూడా లేకుండా పోయింది. 'ఆ చివర కొమ్మమీద కూర్చుని ఆ లాగున తడిసే బదులు ఆకుల సందున దాకోరాద్దా' అని పక్క పక్షులు నా కుపదేశం చేస్తున్నవి? ఎవరి ఆ వేదన ఎవరికి తెలుస్తుంది. కూ...యి, కూ...యి, కూ...యి.

చ.ము: ఏమయ్యా ఆకాశ రాజా! నీ మణిని ఎక్కడ దాచి పెట్టేవయ్యా? అందరినీ కనిపెట్టే నీవు మా కింత అప

కారం చెయ్యవలసి వచ్చిందా నాయనా? నా శబ్దం నీలో దాచుకొనే బదులు నా సఖికి అందజేయరాదూ పుణ్య ముంటుంది. కూ...యి,కూ...యి,కూ...యి.

చ.కి : కాలం పరిపక్వమై తేనేగాని, ఏమీ లాభం లేదు. ఈ దుర్భర దుఃఖంలో నాకు ఉపశమన మిస్తున్నది నా నాధుని పిలుపు వక్కటే. కూ...యి, కూ...యి, కూ...యి.

చ.ము: ఎవరికి మొక్కుకున్నా ఏమీ లేదు. చీకట్లు చిక్క బడి, చిక్కబడి అవే విచ్చిపోతవి. అనంతమైన కాల మంతా ఒక్క రాత్రి కాదుగదా? నా సఖిని పిల్చు కొంటాను. లాభించినా మానినా అదొక్కటే. కువ కువ, కువకువ, కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : కువకువ, కువకువ, కూ..., కూ...యి, కూ...యి.

చ.ము: కూ...యి, కూ...యి, కూ...యి.

3

మూడవ జాము

చ.ము: దుఃఖం ఎక్కువఅయి ఎక్కువఅయి మొగం మొత్తు తుంది. ఎందుకో గాని, ఈ దుఃఖం నా హృదయంలో ఉండలేక, బయటికి పోతోంది. ఏమిటో కారణం? కూ...యి, కూ...యి, కూ—యి.

చ.కి : మబ్బులు మాయమయ్యేయి. పిడుగులు పోయేయి. నక్షత్రాలు రెప్ప వేయకుండా నా కేసి చూస్తున్నాయి.

పోనీ ఆ నక్షత్రపు కాంతిలో నా నాథుడు కనబడితే బాగుండును. కూ... యి కూ... యి, కూ... యి.

చ.ము: ఆశ్చర్యం, ఇంతగాలి వచ్చి ఇంత వాన వచ్చి ప్రపంచం అంతా తారుమారైనా ఈ గోదావరి వకటే గోలపెట్టుతూ ప్రవహిస్తోంది గదా, మనోనిగ్రహం అంటే ఆలాగున ఉండాలి. కూ... యి, కూ... యి.

చ కి : ఈ ప్రళయములో నా నాథుని కేమీ ఆపద సంభవించ కుండా వుండాలిగద! ఎంత పిలిచినా పలకడు, ఎంత చూచినా కనబడడు, కూ... యి...; కూ... యి, కూ... యి.

చ.ము: అయ్యోది అవకమ్మానదు. నా సఖి కోసం యింత తహతహ పడుతున్నా పిలుపుకు మారు పిలుపైనా వినబడ కూడదూ. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : ఇంక లాభం లేదు. ఇంత ప్రళయం వచ్చాక ఇంక నా నాథు డెక్కడో, నే నెక్కడో! ఈ కొమ్మ చిట్ట చివరకు వెళ్ళుతాను. సరిగ్గా గోదావరిమీద వుంటాను. నా గోలను ఈ గోదావరి గోలతో కలుపుకుంటాను. ఆవిడ ఎంతైనా భరించగలదు. ఎందుకింక బ్రతకడం? కూ... యి, కూ... యి, కూ... య్యి.

చ.ము: ఈ దుఃఖంలో లోకం అంతా నన్నగతాళి చేస్తూ ఉంది. నా సఖి కంఠం వినిపిస్తే ఆ ఎగతాళే స్వర్గం కింద భావించే వాడిని. ఇంత సేపు పిలిచాను. ఒక్కమారైనా ఓ అన్న ముక్క చెవులలో పడక పోతే?

ఎందుకీ బ్రతుకు ? ఈ చిట్టచివర కొమ్మమీద నిలబడతాను. కళ్ళు మూసుకొని ఈ గోదావరిలో నా దుఃఖమంతా కలిపి వేస్తాను. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : ఇంకొక్క మారు గట్టిగాపిల్చి ఆతరవాత, కూ... యి, కువ కువ— కూ... యి, కూ... యి, కూ... యి

చ.ము: నేను తొందర పడడం లేదు కదా! ఒక వేళ నా సఖి బ్రతికే ఉందేమో? లోకంలో ఉన్న దుఃఖమంతా కలిసి ఒక్కమారు మొరపెట్టుకొంటూ ఉన్నట్టు మొరపెట్టుతాను. నా సఖి బ్రతికే ఉన్నట్లయితే నాకు మారు పలుకుతుంది. కువ, కువ, కూ... యి, కూ... యి కూ..... యి.

చ.కి : ఇంక లాభంలేదు. ఎక్కడా సమాధానమే లేదు. పిలుస్తూనే గోదావరిలో కలిసిపోతాను. కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: మారుపిలుపు వచ్చినట్లయినా అలుకుడు లేదు. ఎందుకింక ఆశపెట్టుకోవడం, అలవాటైన ఈ పిలుపు అప్రయత్నముగా నోటినుంచి వస్తూనే వుంటుంది. కాబట్టి ఆ గోదావరీ గర్భంలో ప్రవేశించినా నా సఖిని పిలుస్తూనే వుంటాను కూ... యి, కూ... యి, కూ... యి.

౪

## నాలుగవ జాము

చ.కి : భ్రమా ? లేక నిజంగా వినపడ్డదా ? ఏమీ సందేహం లేదు. నా నాథుడి పిలుపే అది. ఎంతమోసం జరిగేదీ. అన్నా, కువ కువ, కూ... యి, కూ... యి, కూ... యి.

చ.ము: ఎంత తొందరపడ్డాను. అదుగో నా సఖి కంఠమే అది. ఎంత సేపటి బట్టి పిలుస్తూ ఉందో ! కువ కువ, కూ... యి, కూ... యి, కూ... యి.

చ.కి : అవును. నా నాథుడి పిలుపే అది. ఈ అనంతమైన అవకాశములో లోకమంతా నిద్రపోతూ ఉంటే లోకాని కంతకూ ప్రతినిధినై ఈ దుఃఖాన్ని ఎవరికి వెళ్లబోసుకుంటూ ఉన్నట్టు మరి! నా నాథుడే. సందేహంలేదు– నా నాథుడి పిలుపేఅది. కూ... యి, కూయి; కూయి.

చ.ము: సఖీ, సఖీ, నామాట వినబడుతూఉందా? కూ...యి కూ... యి ,కూ... యి.

చ.కి : ఓయి, ఓయి. కొమ్మచివరకు, రా – నా స్వామీ, నిన్ను చూచుకుంటాను.

చ.ము: కొమ్మ చివరనే ఉన్నాను. నా కూతనుబట్టి నా దిక్కు నిర్ణయించుకో. కూ...యి, కూ...యి. కూ... యి.

చ.కి : ఈ చీకట్లో కన్ను చూడలేకుండా ఉంది. కాని హృదయం చూస్తూ ఉంది. కూ...యి, కూ...యి. కూ...యి.

చ.ము: నీవు అలాగ పిలుస్తూఉండు. ఈ చీకట్లో నీ కూతను బాటగా చేసుకుని నీ దగ్గరకు వస్తాను. కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : ఏమి ప్రమాదమో వద్దు, వద్దు. ఈ చీకట్లో అన్ని బాటలూ నశించిపోయినవి. సుఖానుభవం ప్రారంభ స్థితిలో ఉన్నప్పుడు నింకు సుఖం కోసము దుఃఖము తెచ్చి పెట్టుకోరాదు. కూ...యి, కూ...యి. కూ...యి.

చ.ము: నీ వక్కడే ఉండు నే వస్తున్నా. నాకూత వింటూ ఉండు–నీ కూతతో నాకు దారిచూపించు–కూ...యి, కూ...యి, కూ...యి.

చ.కి : అమ్మయ్యో నీ వేవైపు పోతావో. నేను నిన్ను కలుసు కొంటా తోవలో. కూ...యి, కూ...యి, కూ.యి

చ.ము: సఖి, ఎక్కడున్నావు నీవు. కూ...యి, కూ...యి.

చ.కి : ఎక్కడ నా స్వామీ నువ్వు, కూ...యి కూ...యి

చ.ము: పైని ఆకాశం, కింద గంగా. ఈ అవకాశమంతా నిండినది నాసఖి పిలుపు. ఎక్కడో, ఎలాగో వెళ్లడం కూ...యి, కూ...యి.

చ.కి : చెట్టు కొమ్మను వదిలి ఎక్కడికో వెళ్ళుతున్నాను. నాకూతా నా నాథుడి కూతా ఏకమై దిక్ని ర్దేశము చేయడము కష్టంగా ఉంది. కూ...యి, కూ...యి.

చ.ము: కూ...యి, సఖీ!

చ.కి : కూ...యి, స్వామీ!

చ.ము: ఎక్కడ ఉన్నావు నా సఖీ! గట్టు కానరాకండా ఉంది. కూ...యి.

చ.కి : గోదావరిమీద ఎగురుతున్నాను స్వామీ! మలిన మైన ఈ గోదావరీ అలలలో నక్షత్రపు తళుకులే కాని ఎంత వెదికినా నీ ప్రతిబింబము కానరాకుండా ఉన్నది. కూ...యి.

చ.ము: నా సమీపములోనే ఉన్నట్లున్నావు-ఇటురా సఖీ! ఇటు-ఇటు కూ...యి

చ.కి : ఎక్కడ స్వామీ! ఎక్కడ, ఎక్కడ! అయ్యో, చీకటే అంతటా నాదృష్టిని ఎదుర్కొంటూ ఉన్నది. ఎక్కడ స్వామీ కూ...యి.

చ.ము: అయ్యో నాసఖి గొంతుక దూరమై పోయినది. సఖీ, నే నిక్కడున్నా. విషాదకూజితాలు చేసుకుంటూ నా సఖి ఎక్కడికో పోతూ ఉంది. సఖీ, ఇటురా, ఇటురా, కూ...యి, కూ...యి.

చ.కి : మళ్ళీ మొదటి దశకు వచ్చాను. నా నాథుడి పిలుపు అంత కంతకు అస్పష్ట మౌతూ ఉంది. నా నాథుడి

కోసం ఈ ఆకాశమంతా వెదుకుతాను, కూ... యి.
కూ... యి.

చ.ము: అయ్యో, నాసఖి దూరమై పోయింది. ఏదిక్కున ఉందని వెళ్ళను? కూ... యి, కూ... యి.

చ.కి : ఈ గోదావరి నీటి మట్టము ననుసరించి పోతాను. ఎప్పటికైనా నా నాథుడి నీడ గోదావరిలో కనపడకుండా ఉంటుందా. కూ...యి, కూ... యి.

చ. ము: సఖి, ఇక్కడున్నా, కూ... యి, కూ... యి.

చ.కి : ఈ చెట్టు గోదావరి మీద తేలుకుంటూ పోతూ ఉంది. దీనిమీద కూర్చుని నాథుణ్ణి పిల్చుకొంటాను. కూ... యి, కూ... యి.

చ.ము: అదిగో నాసఖి కంఠం. నా సమీపానికి వస్తూ ఉంది.
కూ... యి, కూ... యి.

చ.కి : కూ.. యి, కూ...యి,

చ.ము: గోదావరి నా సఖి కంఠంతో కూస్తూఉన్నట్లున్నది. గోదావరి నీటిని సమీపించి వింటాను. కూ... యి, కూ...యి.

చ.కి : అదుగో నా నాథుడు. కూ..యికూ..యి కూ... యి.

చ.ము: అదుగో నా సఖి కంఠస్వరము కూయికూ... యి,

చ.కి : ఏడీ, ఎక్కడ, ఇక్కడున్నట్లే తోచిందే నా నాథుడు! కూ... యి,

చ.ము: ఎక్క డున్నావు సఖీ, వస్తున్నా- కూ... యి, కూ... యి.

చ.కి : కంటికి కప్పిన చీకట్లు విడుతూ ఉన్నట్లున్నవి. అదుగో నా నాథుని నీడ-కూ...యి.

చ.ము: అడుగో సూర్యభగవానుడు వస్తున్నాడు. మా కోసం చీకట్లను కరిగిస్తున్నాడు. అదిగో నాసఖ కూ...యి.

చ.కి : నాథా, రా, రా, రా స్వామీ, రా, రా నా ప్రక్క కూర్చో.

చ ము: ఎంత పుణ్యము. అదిగో నా సఖి ఆ కొమ్మమీద. గోదావరీ తల్లి తన హృదయం మీద కూర్చొ బెట్టు కుంది. వెళ్ళుతున్నా నా సఖి దగ్గరికి, కూ... యి.

చ.కి : కూచో స్వామీ కూచో. నా ప్రక్కనికూచో. ఎన్ని యుగాలైనది.

చ.ము: ఎన్ని యుగాలైనది! ఇంతకాలం బ్రతికి నందుకు ఇప్పుడు సౌఖ్యం. ఆ సూర్యభగవానుడికి నమస్క రించు సఖీ. ఎంత పుణ్యాత్ముడో మనలను మళ్ళీ కూర్చినాడు.

చ.కి : ఆ తండ్రే మనల నెప్పుడూ ఒక కంటితో చూస్తూ ఉంటాడు.

చ.ము: ఈ గోదావరి ఇంత పెట్టుతూ వుంది. ఎక్కడకు వెళ్లుతూ వుందో చూద్దాము పద. ఇదీ - తన భర్తను చేరడానికి ఇంత తాపత్రయం పడుతూ ఉన్నట్లుంది.

చ.కి : చూద్దాము పద !

చ.ము: కూ... యి.

చ.కి : కూ... యి.

—*—

# మానవుడు

## ౧

## బ్రహ్మ — మానవుడు

బ్రహ్మ : ఏమిచేస్తున్నావు, మానవుడా; యిక్కడ?

మానవుడు : తపస్సు.

బ్ర : ఎంతకాలంనుంచీ చేస్తున్నావు?

మా : ఆరుశతాబ్దముల నుంచి.

బ్ర : ఎందుకు?

మా : ప్రపంచము నుద్ధరించడానికి.

బ్ర : ధనదేవతను - గురించా తపస్సు?

మా : కాదు, దైహాన్ని గురించి.

బ్ర : నీ దేహామంతా పాలిపోయిందేమి, వెల్లమానిసీ.

మా : కష్టపడి తపస్సు చెయ్యడం వల్లనే.

బ్ర : ఈ తెలుపు నీకు సహజమా?

మా : ఇప్పుడుకాదు. ఇకముందుకావలెనని కోరిక.

బ్ర : ఎందుచేత?

మా : దేవరవారు తెలుపు, శివుడు తెలుపు, నారదుడు తెలుపు, సరస్వతమ్మవారు తెలుపు, కల్పవృక్షము తెలుపు.

బ్ర : చాలు చాలు, వీరంతా తెలుపైతే?

మా : నాకూ తెలుపు కావాలి.

బ్ర : ఉద్దేశము ?

మా : వీరి తరఫున నేను లోకము పరిపాలించవలెను.

బ్ర : అందుకేనా నీవు తపస్సు చెయ్యడము ?

మా : చిత్తము.

బ్ర : అయితే ఇంతకాలమూ ఏ విధంగా నీవు తపస్సు చేశావు ?

మా : కొంతకాలము నీటిమీద- తుపానులమధ్య సంచరించాను. కొంతకాలము అడవులలో అనాగరికులతో భూమి దున్నినాను; కొంతకాలము వేడి దేశాలల్లో సంచరించి సూర్యకిరణాలను ఆస్వాదించాను; కొంత కాలము మంచు కెరళ్ళలో నివాసము చేశాను.

బ్ర : అయితే నీకేమి వరము కావలెనో కోరుకో !

మా : అధికారము.

బ్ర : ఎందు కధికారము ?

మా : మానవులకు సౌఖ్యము కలిగిస్తాను.

బ్ర : సరే; ఇంకేమైనా కావలెనా ?

మా : ఆయుధాలతో, అనగా, ఏ మారణసాధనములవల్లా నాకు మరణము లేకుండా అనుగ్రహించాలి.

బ్ర : మంచిది. అంతేనా

మా : చిత్తము !

## ౨

# బ్రహ్మ — సరస్వతి

సరస్వతి : అవునా, ప్రాణ నాయకా!

బ్ర : ఏమిటి చెబుతున్నావు ?

సర : ఈ పొద్దు ఇంత పరాకు వచ్చిందేమి ?

బ్ర : ఏమి పరాకు ?

సర : నే నెంత సేపటినుంచో అడుగుతున్నానుగాని, మీరు మాటాడితేనా !

బ్ర : నేను మాటాడక ఏమిచేస్తున్నా నంటావు ?

సర : శివుడికి స్థాణువు పర్యాయపదము, మీకు జడత్వము లోకు లారోపించారు. నేనేమి మాట్లాడుతున్నాననా, అంటారు ?

బ్ర : నేనేమి చేస్తున్నానని అడిగినాను. నీకీ వాచాలత్వ మెప్పటినుంచి ?

సర : పుట్టుకతోనే.

బ్ర : ఏమిటి అడుగుతున్నావు.

సర : ఏమీ లేదు. ప్రజల ఆరోపణకు కారణమున్నదా అని ఆలోచిస్తున్నాను.

బ్ర : నన్నుగురించా; నిన్ను గురించా ఆరోపణ ?

సర : నన్ను కూడా కలుపుకోవాలని వుందా ? ఏమిటి అలా అడుగుతున్నారు ?

బ్ర : పోనీ నా మట్టుకే అయెను ! ఏమిటో ఆ ఆరోపణ ?

సర : వేదములు మీాయందే పుట్టినవిగదా!

బ్ర : పుట్టితే ?

సర : వేదాధ్యయనము చేసేవారికివస్తే ఆ నింద-

బ్ర : నాకు ఆ జడత్వమున్నదంటావా ?

సర : బాగుంది! నే నెందు కంటాను. అన్నీ ఇలాంటి మాటలే.

బ్ర : మరి యెవరు ?

సర : లోకులన్నమాట. ఎప్పుడూ మీాకు మరుపే.

బ్ర : ఆ మాట యిప్పుడెందుకు వచ్చింది ?

సర : భక్తులమీాద వాత్సల్య ముండవలసిందే, కాని వారికి వరాలిచ్చేటప్పుడు వారి మాటలా ముఖ్యము, మనస్సా ?

బ్ర : అదా నీ వింతసేపటినుంచీ ఆలోచిస్తూంది ? సాధారణంగా మనస్సేగాని, ఈ ఒక్కమారు మాటలు ముఖ్యమయినవి.

సర : ఈ ఒక్కమారు ఎందుచేతనో ?

బ్ర : లోకపరిమాణానికి అడ్డురాకుండా.

సర : ధనదేవత నుపాసిస్తే మీా రెందుకు వర మివ్వడము ?

బ్ర : బాధ్యత నాదికదా.

సర : అయితే ?

బ్ర : లోకానికి జీవచరిత్ర వున్నది. వృద్ధిక్షయాలున్నవి. ఇవన్నీ చూస్తూ వుండవద్దా ?

సర : అయితే లోకము జాతకము మీరు నడుపవలెనా ?

బ్ర : అందుకనే జాతకాన్ననుసరించి నడపడానికి ఈ వింత మనిషికి వరాలిచ్చాను.

సర : అందువలన లోకము క్షీణిస్తే ?

బ్ర : క్షయముకోసమే యిలా చేస్తే, వృద్ధి యెంత సహజమో క్షయముకూడా అంతసహజమే. వృద్ధి అని సంతోషము లేదు; క్షయమని విచారములేదు.

సర : ఈ క్షయము మానవుడు వృద్ధి అనుకుంటాడేమో.

బ్ర : అనుకుంటాడు. అనుకోవడము కూడా నేను కోరేదే.

సర : ఎందుచేత ?

బ్ర : లయకాల ప్రాప్తి లోకానికి కలగడానికి. అది యీ విధముగానే కదా పరిణమించవలసింది!

సర : వారు వృద్ధి అనుకొనేది మీకు క్షయమని ఎలా తోస్తుంది ?

బ్ర : దృష్టులు మావైపు తిప్పినప్పుడుకదా లోకము వృద్ధి చెందు చున్నట్టు నిదర్శనము.

సర : సరే యీ లోకము సంగతి యెందుకుగాని ...

బ్ర : నీవే యెత్తావు-ఆ సంగతి.

సర : నాకుకూడా కొంచెం లోకంతో సంబంధంవుందిగదా అని అడిగాను.

బ్ర : నీ సంగతికూడా ఆలోచిస్తున్నాను.

సర : నా సంగతి కేమి ?

బ్ర : నీ విద్యలు ప్రాకృత జనాన్ని ఆశ్రయించ వలసి వస్తవేమో.

సర : ఏం చేస్తాము! మీ వేదాలు మీనోళ్ళల్లోనే మోగ నివ్వండి; ఆ ధ్వనిలో నేను లీనమై యుంటాను.

## 3

## బ్రహ్మ, ఆరుగురు దిక్పాలకులు

బ్ర : ఇంతసందడిలో వచ్చినారేమి దిక్పాలవరులారా?

అందరు : సృష్టికర్తకు మా మీంద దయ తప్పినట్లుంది.

బ్ర : ఎందుచేత?

ఇం : ప్రపంచ సామ్రాజ్య భారము ఆత్మలాభపరాయణు డైన ఒక్క మానవుడికి వదిలి మే మేల కావలె దేవా?

బ్ర : మీ కేమి వచ్చిం దిపుడు?

ఇం : నేను లోకములో స్వేచ్ఛగా సంచరించడానికి వీలు తప్పింది.

బ్ర : ఏమి?

ఇం : అక్కడి పరిస్థితులు అలాగమారడము చేత, నేను భూలోకానికి పోలేకున్నాను. ఇదివరలో నెలకు మూడుసార్లు భూమినంతా చుట్టివేసేవాడను. ఇప్పుడు ఎడారులు పట్టిపోతున్నాము.

బ్ర : మిగిలినవారి సంగతి?

అగ్ని : దేవా ఏమి చెప్పుకోను ? సిగ్గవుతున్నది. నాచేతనే మానవుడు బళ్లు లాగిస్తున్నాడు. గాజు కుప్పెలలో నన్ను బంధించి మా ధూమరాజు నన్ను తాకకుండా చేస్తున్నాడు. వరుణుడూ నేనూ కలిసి ఇనుపచ్రకాలు తిప్పుతున్నాము. ముప్పొద్దులూ ధూమ ప్రత్రాన్ని ఆశ్రయించవలసి వచ్చినది దేవా !

బ్రహ : వరుణు డెక్కడ ?

వరుణుడు : తమ యెదుటబడటానికి మొగం చెల్లడం లేదు. నాకు తీగెలతో గొట్టాలతో సంకెళ్ళుపడ్డవి. మానవుడుకి సేవకుడనై వాడికోసము దీపాలుముట్టిస్తున్నాను. వీవనలు విసురుతున్నాను. నరకాసురాదుల కాలంలో కూడా ఇటువంటి పనులు చెయ్యలేదు దేవా ?

బ్రహ : నీ వెందుకు విసనకర్రలు తిప్పవలె ? వాయువున్నాడు గాదా స్వేచ్ఛగా—

వాయువు : దేవా నేనేల విసనకర్రలు పట్టడము లేదనా మీ చింత ? మీకుకూడా నామీద దయతప్పవలెనా? ఇప్పుడు నేజేసేపనులు అంతకంటె ఘనముకావు. దీపి కాకళికలతో నా విహారములు కట్టిపెట్ట వలసి వచ్చింది. మానవుని కోసము పిండి విసురుతున్నాను. పడవలు ఓడలు లాగుతున్నాను. వరుణుడి హృదయము ఉష్ణంగ జెయ్యవలసిన వాడను, సౌరభాలు హృదయాన పూనవలసినవాడను, మానవుల హృదయము ఉష్ణంగజేస్తూ యంత్రములలోనుంచి బయలుదేరే పొగలు పీలుస్తున్నాను.

బ్ర : యముడు బాగున్నాడా ?

యముడు: ఎక్కడి బాగు! నా పూర్వపు పోకడలు తప్పినవి. నా ధర్మము లంతరించినవి.

బ్ర : ఏలాగు !

య : ధర్మశాసనాలు తమంతట తాముండవు — వ్యక్తుల పనులమీద ఆధార పడివుంటవి. వ్యక్తులకే మీరు స్వేచ్ఛ యిచ్చినప్పుడు వారి దుర్నయములో నా శాసనములు మునిగిపోయినవి. నేను మానవుడి యింట కావలివుండి వాడి శాసనములనుబట్టే నడచుకోవలసి వచ్చింది. నా కార్యదర్శి మృత్యువు పూర్వ మార్గములు విడిచినాడు. మానవుడి ఆజ్ఞ ప్రకారము అతను క్రిములను ఆశ్రయిస్తున్నాడు.

బ్ర : అది యెలాగ ?

య : ఇదివరలో అతను వాతపిత్తాదులను ఆశ్రయించి తన పనులు నడపేవాడు, నేడు క్రిములను.

బ్ర : సరే. కుబేరు డేడీ ?

కుబేరుడు: దేవా, నేటికి నాకీస్థితి వచ్చింది. మానవుడికి షరాబునై ఇంట్లో పద్దులు వ్రాస్తున్నాను. బొగ్గులోను, ఇనుములోను, భూగర్భమున నేను దాచుకొన్న నిధులను మానవుడు బలాత్కారంగా పుచ్చుకొన్నాడు. నిధులు పోయినతర్వాత నా కాధార మేదీ ?

బ్ర : నైరుతి కనిపించటంలేదు, ఎక్కడున్నాడు ?

ఇంద్రుడు: అతను మానవుడికి మంత్రి అయినాడు. అతను నీతివేత్తని మానవుడి నమ్మకము.

బ్ర : పోనీ, మీలో ఒకడయినా సుఖంగావున్నాడు.

ఇం : అతనికిమాత్రము సుఖమెక్కడిది ? ఎక్కడా లేని రాజనీతులు అతను ఎప్పటికి కప్పుడు కల్పించి, మానవుడి చేత న్యాయపరిపాలనము చేయిస్తున్నాడు !

బ్ర : ఈశాను డెక్కడ ?

ఇం : ఆయన అగోచరుడైనాడు దేవా! ఆయన మూర్ధము నలంకరించే గంగ పాయలగా చీల్చబడి పట్టరాని దేశాలు పట్టింది. ఆమె గమనము విరుద్ధమయిపోయింది. ఈ శానుని ఇల్లు ఈమధ్య శోధించడానికికూడా మానవుడు బయలుదేరినాడు. ఇల్లు పోదా చూస్తారనేసరికి ఆయన అంతర్ధాన మయినాడు. సర్వజ్ఞుడైతేనేమి - ఆయన ముష్టిచెంబును ఆయన వదలలేదు.

బ్ర : సరే, కాలమూ కర్మా బాగానే పరిపక్వమవుతున్నవి. కొద్ది రోజులలోనే మీ కష్టాలు తొలగిపోతవి లెండి. అన్నట్టు మానవుడు పాలించే లోకములో ఇతరులకు సౌఖ్యమున్నదా ?

ఇం : సౌఖ్యమా చట్టుబండలా ? ఈ మానవుడికి వారంతా బానిస లయినారు. వారి యేడుపులు ఎప్పుడూ మా చెవులలో గింగురుమంటూ వుంటవి.

బ్ర : మాకు వినపడఢము లేఢేమి ?

ఇం : మీదాకా రావు ఆ ఆర్తనాదాలు. కుబేరుని రూపా యల చప్పుడులో ఆ ఘోషలు అంతర్లీన మవు తున్నవి.

# ౪

## బ్రహ్మ - సరస్వతి - చిలుక

బ్ర : ముంజేతిమీద చిలుక నెక్కించుకుని కబుర్లు చెప్పు కునేబదులు నిన్ను ఉపాసనచేసే భక్తులవైపు ఒక మారు చూడరాదూ!

సర : మీ రింతగా చూశారుగద ?

బ్ర : ఏమి ?

సర : ఇప్పుడే చిలుక చెప్పగా విన్నాను. మీరు వరా లిచ్చిన భక్తుడు...

బ్ర : చిలుక కెలా తెలిసింది ?

సర : ఏమ్మీ, నీ కెలా తెలిసిందంటున్నారు నాథులు- మాట్లాడవేమి ?

చిలుక: ఏలిన వారికి కోపమువస్తే మళ్ళీ మానవలోకంలో పుట్టవలసి వస్తుందని భయము !

సర : భయము లేదులే చెప్పు.

చిలు : నేటిప్రుదయము మందాకినీ ప్రాంతాన విహారము చేస్తున్నాను. స్నానముచేసి అక్కడ జపంజేసుకో బోతున్న నారదులవారు మీ కుశలమడిగి భూలోక వార్తలు చెప్పారు.

సర : ఆ వార్త లేపో నాథులతో నీవే చెప్పు. నే జెప్పితే వారికి కోపంవస్తుంది.

బ్ర : అలాగైతే చిలుకను చెప్పనియ్యను. నీవే చెప్పవలె.

సర : నన్ను నిర్బంధం చేస్తారా?

బ్ర : నా కామాత్రము హక్కు లేదూ?

సర : మీ హక్కులు ఆడవాళ్ళమీదే గాబోలు!

బ్ర : నాకు నాలుగు ముఖాలున్నా, ఏకముఖవైన నీకు సమాధానము చెప్పలేక పోతున్నాను. అందుచేతనే ఎంతటి పురుషుడయినా ఆడుదాని –

సర : చాల్లెండి నేర్చుకున్నారు! ఎప్పుడూ నామీదే మీరు.

బ్ర : అదిగో మాటల్లో మరిపిస్తున్నావు. ఏమిటా వార్తలు?

సర : వార్తల కేమున్నవి. మీకోసం మానవుడు తపస్సు చేశాడు.

బ్ర : అవును.

సర : మహాభక్తుడని అతనికి మీరు వరాలిచ్చారు.

బ్ర : ఎందుకని వరాలిచ్చానో నీతో చెప్పనే చెప్పాను.

సర : ఆ భక్తుడు లోకమేలి, మానవుడికి సౌఖ్యమిచ్చాడు.

బ్ర : మానవుడి పరిపాలనా క్రమము దిక్పాలకుల నోట విన్నానులే.

సర : లోక పరిణామానికి తోడుపడే ఈ మానవుడు లయ కాల ప్రాప్తికి తోడుపడే యీ మానవుడు, నేడు-

బ్ర : కృశించిపోతున్నాడు.

సర : మీకు తెలిసే నన్నెందు కడుగుతున్నారు ? ఇదీ హాక్కే కాబోలు !

బ్ర : ఇంతేనా నీవు తెలుసుకుంట ?

సర : ఇంతో అంతో, మానవుడు కృశించిపోడే, మీ రత నికి ప్రాప్తి వుంటే.

బ్ర : నే నిదివరలో నీతో చెప్పినమాటలు....

సర : జ్ఞాపకం లేకపోలేదు.

బ్ర : ఇంకేమి ?

సర : మ రేమిలేదు. మానవుడి పరిపాలనవల్ల క్షయంచెంది పరిణమించవలసిన భూలోకం ఈమానవుడి కృశత్వం వల్ల కలిగిన దౌర్బల్యంచేత పరిణామము చెందు తుంది కాబోలు.

బ్ర : ఇప్పటికి క్షయము చెందిందిచాలు. అధర్మము ప్రబల మయింది గనుక ధర్మసంస్థాపన మళ్ళీ చెయ్యడము కూడా పరిణామమే.

సర : ఈ సంగతి మీరిదివరలో నాతో చెప్ప లేదులెండి. పోనీ, కాని నాకొకటి తోస్తుంది.

బ్ర : ఏమిటి ?

సర : బృహస్పతిలాగ మీరుకూడా ఒక పుస్తకమురాస్తే-

బ్ర : ఏమిటో ఆపుస్తకము.

సర : రాజనీతి, బ్రహ్మగారి రాజనీతి అందరూ చదువు
కుంటారు, సరేగాని మానవుడికి కృశత్వ మెల
వచ్చింది ?

బ్ర : లోకములో కొత్తశక్తి పుట్టించారు.

సర : ఏమిశక్తి ?

బ్ర : మునుల మనస్సులలో వుండేశక్తి. సంకల్ప బలమ
చేత మానవులిప్పుడు శత్రువులను జయిస్తున్నారు.

సర : ఆ శక్తివల్ల నేనా మీ భక్తుడిప్పుడు కృశిస్తుంట.

బ్ర : అవును. ఆయుధాలతో చావు లేకుండా కోరుకొన్న
యీ వెల్లమానిసి ప్రజాసంకల్ప బలానికి లొం
నాడు.

సర : కృశత్వముతో ఆపుతారా ?

బ్ర : కృశత్వము మృత్యుభవనానికి తలవాకిలి.

సర : మంచి ఆశ్రితభక్తవత్సలులే మీరు !

బ్ర : అది మానవు లనేమాట !

సర : మీ రనేమాట యేమిటో ?

బ్ర : బుద్ధిమంతురాలవు నీకు తెలియదూ.

సర : చిలుకకు తెలుసు నేమో.

బ్ర : అడిగిచూడు.

సర : చిలకా మాటాడవేమి ?

సర : నా నాథునితో ఆమాట చెప్పు.

చిల : దేవరవారు భూలోకంలో సంచారము చేస్తారుట.

సర : నన్నుకూడా తీసుకు వెళ్ళతారా ?

బ్ర : నా మనస్సులో మాట నారదుడు తెలుసుకొని అప్పుడే వెల్లడి చేస్తున్నాడు.

సర : సంచార మెందుకో ?

బ్ర : మనము సకుటుంబంగా ఒకమారు వెళ్ళివస్తేనే గాని నేను వెదజల్లిన సంకల్ప బీజాలు అంకురించవు.

సర : నా కేమిపని వుంటుంది ?

బ్ర : నేను జ్ఞానబీజములు, నీవు విజ్ఞానబీజములు చల్లవలెను.

సర : సరే, అయితే చిలకా, హంసను ప్రయాణానికిసిద్ధంగా వుండమనవే! నాథా, నేనింకా రాలేదనీ – నా వీణ నన్ను పిలుస్తూ అప్పుడే పాడడం ప్రారభించింది.

బ్ర : ఆ గానము ఎక్కడినుంచో వస్తున్నట్టు – నాకు వినబడటంలేదు.

సర : చాలులెండి ! నేర్చుకున్నారు – ఎలాగైతేనేమి !

---

# కైలాస శిఖరం

## ౧

### రంగము: పర్వతదేశము

[ ప్రవేశము: చెట్టు; కొండ ]

చెట్టు : కొండరాజా, కొండరాజా !

కొండ: [మాటలేదు.]

చెట్టు : నాకొండా, ఓ నా కొండా !

కొండ: [మాటలేదు.]

చెట్టు : ఏమయ్యా, పర్వతరాజా ! నామాట నీకు వినబడటం లేదా ?

కొండ: [మాటలేదు.]

చెట్టు : నా దుఃఖంలో మునిగిపోయి నామాటలు బయటకు రావడంలేదా యేమిటిచెప్మా! కంఠం సవరించుకొని గట్టిగా పిలుతునా? ఓహో పర్వతరాజా ! నాతండ్రీ! నీకుకూడా దయలేదా? ఒక్క మాటైనా మాట్లాడవు !

కొండ: ఎవరా కేకలు? నానిద్రకు భంగం చేసేవా-రెవరు ?

చెట్టు : నేనయ్యా, నారాజా, నేను.

కొండ: నేనంటే ?

చెట్టు : నీహృదయంలో మొలిచి పెరిగిన చెట్టును! నిద్రలో నీ ప్రేమ అంతరించిందా నాయనా?

కొండ: నువ్వాటమ్మా తల్లీ! ఎవరో అనుకొన్నాను. నిద్ర మధ్యలో లేపవచ్చినావు - ఏమీ ఉపద్రవాలు రాలేదు కద?

చెట్టు : ఇంకా నిమ్మళంగా అడుగుతున్నావా నాయనా? ఉపద్రవాలన్న ఉపద్రవాలా! ఏమి చెప్పేకోను నాయనా? గొంతు కెండిపోయి మాట రావడంలేదు. ఎన్నిమార్లు పిలిచాను నిన్ను, మాట పైకి రాందే! నాలుక పిడచకట్టుకు పోతున్నది నాయనా!

కొండ: ఏమమ్మా, ఏమి మూడిందేమిటి! చెప్పు! చెప్పు!

చెట్టు , నీవు నిద్రపోతున్న సమయం చూచి దాపరించినవి నాయనా!

కొండ: ఏమి టేమిటి?

చెట్టు : ఏవో వెల్లమొక్కల విత్తనాలట! మిడతల దండు లాగు వచ్చిపడి, నిన్నాశ్రయించిన నాకూ నా సంతానానికీ ఊపిరి సలపకుండా చేస్తున్నవి!

కొండ: ఎప్పుడు వచ్చినవమ్మా యివి?

చెట్టు : నువ్వు అప్పుడే నిద్రపోయినావు. ఏదో పడమటి గాలికి వచ్చిపడినవి.

కొండ: మరి నీవు చూస్తూ ఎందుకూరుకున్నావు?

చెట్టు : ఎన్ని వచ్చినవికావు, ఎన్ని పోయినవికావు! ఇవి మాత్రము శాశ్వతంగా వుంటాయా అనుకొన్నాను.

కొండ; [ముక్కుమీద వేలుంచి] నాకు కొంచెమైనా తెలిసింది కాదు! ఎంతపని జరిగింది.

చెట్టు : నిద్రపోతున్నవాణ్ని నిన్ను - లేపడ మెందుకనుకున్నాను.

కొండ: పోనీ పడమటగాలికి వచ్చిపడితే నాహృదయంలో వున్ననీరు వాటికెలా వచ్చింది? అంతదాకా బీజాలు పోలేవే.

చెట్టు : సముద్రాల్లో ఈదుకుంటూ గాలికి కొట్టుకొచ్చినవి. అందుచేత నీ నీరు అవసరం లేకపోయింది.

కొండ: తరవాత?

చెట్టు : తరువాత కేముంది? పుట్టిముంచేసినవి!

కొండ: ఎట్లా?

చెట్టు : వచ్చీ రావడంతోటే నా చిన్న మొక్కలతో సాహసంచేసి—కుర్రకుంకలు వాళ్ళకేం తెలుసు—వేళ్లు కిందకు దింపుకొన్నవి.

కొండ: వాయుదేవుడూ, సముద్రుడూ వాళ్ళపక్షం చేరడం వల్ల ఇంతమట్టుకు వచ్చింది. తరవాత?

చెట్టు : అన్ని మొక్కలు దట్టంగా ఆవరించి మాకు నీటిబొట్టయినా లేకుండా చేస్తున్నవి.

కొండ: ఇతరప్రదేశాలకు జీవనార్థము నీ బీజాలు పంపలేకపోయినావా?

చెట్టు : అక్కడా ఈ ఖర్మమే వచ్చిపడింది!

కొండ: తీరా పాకం ముదిరింది. ఇప్పుడేం చెయ్యగలమూ?

చెట్టు : నీ హృదయంలో నీరు బిగించి మా కుటుంబానికే యిస్తూవుండు.

కొండ: అప్పుడు మీమీదే అవి మొలచి మీసారం లాగితే?

చెట్టు : ఇప్పుడూ ఆ పని చేస్తూనేవున్నవి. ఈ దుఃఖంలో నాకు ఆలోచన తోచడంలేదు.

కొండ: నేనేమి చేసినా ఇప్పుడు ప్రపంచ శాసనాలకు వ్యతిరిక్తమవుతుందేమో.

చెట్టు : అయితే మాగతి ఇంతేనా ?

కొండ: సృష్టికర్త శాపం భరించలేనేమో.

చెట్టు : బిడ్డల దుఃఖం భరించగలవా ?

కొండ: అయినా ఉపాయం ఆలోచిస్తా. అట్టే దుఃఖించబోకు.

౨

## రంగము:—మేఘమండలము.

[ప్రవేశము: కొండశిఖరము, కైలాసశిఖరము]

కొండశిఖరము: మహారాజా !

కై.శి : [సమాధిలో నుండును. ప్రత్యుత్తరము లేదు.]

కొ.శి : ఓ నా మహాస్వామీ, నీకు జోహారు !

కై.శి : [కళ్లు తెరచును.]

కొండ: వాయువేగ నిరోధం చెయ్యగల నాదొరా ! వాయుదేవుడు మా కపకారం చేశాడు !

కై.శి : ఏమోయి, వేళగాని వేళవచ్చావు !

కొం.శి : నా కపకారము జరిగింది రాజా !

కై.శి : వాయు దేవుడు చేశాడా ?

కొం.శి : మీా పాదాలు కడుగవలసిన సముద్రుడు వాయు దేవుడితో జట్టుకట్టాడు.

కై.శి : సరే. ఎట్టి అపకారం ?

కొం.శి : కడుపుచిచ్చు నా రాజా ! కడుపుచిచ్చు పెట్టారు !

కై.శి : సరే. మీా కుటుంబకష్టములు నామనోనేత్రానికి గోచరించినవి నీవు - వెళ్ళవచ్చు.

కొం.శి : మమ్మల్ని పాలించరా దేవరా ! మా కష్టాలు గట్టెక్కించరా ?

కై.శి : ఆత్మలాభ పరాయణత్వము శ్రేయస్కరముకాదు సుమా, కొండా !

కొం.శి : చిత్తము !

కై.శి : అది ముక్తిమార్గము చూపించదు.

కొం.శి : చిత్తము రాజా ! కడుపుచిచ్చు ! అంతే !

కై.శి : లోకమంతా ఒక కుటుంబ మన్నమాట మరిచిపోకు.

కొం.శి : చిత్తము, మహాస్వామీా !

కై.శి : ప్రేమవల్ల ప్రేమపుడుతుంది సుమా.

కొం.శి : చిత్తము !

కై.శి : వైషమ్యము వైషమ్యాన్ని పెంచుతుంది.

కొం.శి : చిత్తము !

కై.శి : లోక సౌహార్ద్రము జగత్కల్యాణానికి మార్గము.

కో.శి : దేవరా!

కై.శి : ఓ.

కో.శి : నా నివాసం భూమండలంలో.

కై.శి : అవును.

కో.శి : దేవరవారి నివాసం మేఘమండలంలో.

కై.శి : అయితే ?

కో.శి : తమకు మంచు కెరళ్ళే కిరీటం.

కై.శి : అయితే ?

కో.శి : తమ హృదయసౌరభాన్ని గంగమ్మతల్లి గ్రహించి పావనమవుతున్నది.

కై.శి : ఊc.

కో.శి : నా హృదయభారం తగ్గడానికి తెరువు చూపించరా?

కై.శి : మనస్సు భగవంతునివైపు తిప్పుకో.

కో.శి : కష్టపరంపరలు చుట్టుకొనడంచేత సంసారం నాచెవిలో రొదపెట్టుతున్నది. అందుచేత మనస్సు వికలమవుతున్నది దేవా!

కై.శి : ఇంద్రియాలను నిగ్రహించవయ్యా కొండా!

కో.శి : ఇంద్రియశోష వచ్చింది దేవా!

కై.శి : ఏమి నీకోరిక ?

కో.శి : న్యాయం దయచేయించండి మహాప్రభూ!

కై.శి : పౌరుషమున్నప్పుడు గదా దైవం తోడ్పడేది.

కో.శి : దైవం తోడ్పాటులేని పౌరుషం నిష్ఫలం గదా, మహాస్వామీ!

కై.శి : ఎట్లు ?

కొ.శి : దైవం కర్మక్షయం చేస్తుంది; పౌరుషం స్వతంత్రంగా చెయ్యలేదు.

కై.శి : పురుష ప్రయత్నంలో లోటు చెయ్యకు. వెళ్ళు, దైవం తనంతతనే వస్తుంది.

కొ.శి : మహాప్రసాదము ! వాయువు మాటా, సముద్రుడి మాటా సెలవిచ్చారు కారు.

కై.శి : వాయువూ, సముద్రుడూ స్వతంత్రులు కారు.

కొ.శి : చిత్తము.

కై.శి : ఇతరుల నిగ్రహానుగ్రహాలతో వారికి పని లేదు.

కొ.శి : చిత్తము !

కై.శి : వారికి శత్రువులంటూ లేరు.

కొ.శి : మహాస్వామివారు వాళ్ళను నిగ్రహించ—

కై.శి : నిగ్రహించడం కాదు; వారి కార్యాలకు తోడ్పడటమే.

కొ.శి : చిత్తము !

కై.శి : కార్యసిద్ధికి మార్గం చూచుకో. వెళ్ళు.

కొ.శి : చిత్తము మహాస్వామీ ?

3

## ప్రదేశము:— పర్వతదేశము

[ ప్రవేశము: చెట్టు; కొండ. ]

చెట్టు : ఎంత సేపటికి వచ్చావు నా రాజా !

కొండ: ఏమమ్మా, ఎలాగున్నది సంగతి ?

చెట్టు : అలాగేవున్నది. వెళ్ళినదానికి ఫలమేమిటి ? కాయా, పండా ?

కొండ: ఏం చెప్పను ?

చెట్టు : ఏమన్నారు మన మహాస్వామి ?

కొండ: ఏమంటాడు ! ధర్మోపదేశం చేశాడు.

చెట్టు : ఉపదేశానంతరం ?

కొండ: ఉపదేశము.

చెట్టు : ఏమని ?

కొండ: ఏమో పౌరుషమట, సౌహార్దమట. ఏమేమో చెప్పి నాడు.

చెట్టు : సరి, సరి ! ఆఖరికి ఇదా ఫలితం ?

కొండ: శిరస్సు మేఘాలలో పెట్టుకొన్నవాడికి భూమండలం మరుపువస్తుంది.

చెట్టు : బాగాచెప్పావు ! దృష్టులు పైకి వెళ్లడం మొదలు పెడితే మళ్ళీ కిందికి దిగవు.

కొండ: ఇప్పుడేమిటి- కర్తవ్యం ?

చెట్టు : బాధానుభవం.

కొండ: బాధానుభవం బాధానిర్మూలన సాధనమా ?

చెట్టు : ఆస్థితికి నిరంతర పరిచయం కలిగిస్తూ బాధ అనే బుద్ధి లేకుండా చేస్తుంది.

కొండ: దానివల్ల లాభం ?

చెట్టు : బాధను మరవడమే.

కొండ: అదికాదు. శత్రువిజయంకదా మన లక్ష్యం.

చెట్టు : అప్పుడు శత్రుత్వం, మిత్రత్వ మవుతుంది.

కొండ: మరి ఆలాగు చెయ్యక ఎందుకు నాతో ఫిర్యాదు చేశావు !

చెట్టు : కడుపుచిచ్చు నాయనా !

కొండ: ఇప్పటిదాకా ఆ సంగతి మరిచావా ?

చెట్టు : ఏదో మాటవరసకు అంటున్నానుగాని మనస్సు ఎంత పరితపిస్తున్నది కాదు !

కొండ: మరీ—దీని కేమిటి ఉపాయం ?

చెట్టు : నాకు తోచకే కాదా, నిన్నడిగాను.

కొండ: నాకు తోచకే కాదా, కైలాసాన్ని అడిగాను.

చెట్టు : ఏమిటి మరి చేసేది ?

కొండ: సర్వకార్య నిర్వహణానికి పరాపేక్ష ముఖ్యం కాదు.

చెట్టు : సరే.

కొండ: ఆత్మబలంతో నిజకార్యాలు గట్టెక్కించుకోవలె.

చెట్టు : సరే.

కొండ: నాశిఖరంమీద సంచారం చేసే మేఘాలనుంచి నీరు
గ్రహిస్తాను.

చెట్టు : ఊఁ ఊఁ, చెప్పు చెప్పు !

కొండ: నీ ఆకులచలవ వాటి కిచ్చి పొగమంచుగా మార్చు.

చెట్టు : తరువాత.

కొండ: పూతపూసే శత్రువృక్షాలమీదికి పూ దేసెయ్యి.

చెట్టు : మన కుటుంటానికీ వస్తుందే అపాయం !

కొండ: వాటికీ వస్తుంది; వీటికీ వస్తుంది.

చెట్టు : మరి ఎలాగ ?

కొండ: మన కుటుంబంపోతే మళ్ళీ వస్తుంది.

చెట్టు : అవి పోతే?

కొండ: మళ్ళీ అవి రావడానికి వాయుదేవుడూ, సముద్రుడూ
రావాలి.

చెట్టు : ఈ భ్రూణహత్యలకు ఒడిగట్టగలనా !

కొండ: పాలుమాలికవల్ల కలిగే కుటుంబ మూలచ్ఛేదం
మంచిదా ?

చెట్టు : ఎంతకష్టం దాపరించింది !

కొండ: జీవన్ భద్రాణి పశ్యతి.

చెట్టు : మహాస్వామికి కోపం రాదుకద ?

కొండ: ఆయన ఉపదేశక్రమమే యిది.

చెట్టు : మొదట తొందరపడ్డావేం ?

కొండ: ఉత్తమ పురుషసంసర్గంవల్ల కలిగినవాసన చప్పున పోదు.

చెట్టు : సూర్యుణ్ణి ఉపాసించడానికి తరుణ మయింది. పోదునా ?

కొండ: నేనూ సమాధిలోకి పోవాలి. మేఘాలు శిరస్సునాచ్ఛాదిస్తున్నవి.

చెట్టు : వెళ్ళుతా నా కొండా !

కొండ: మంచిదమ్మా, చెట్టూ !

